


'చిత్రభూమి' సంస్థ ద్వితీయ కానుక

సరికొత్త వారపత్రిక

**మొదటి బహుమతి: రూ. 1,116-00**
**రెండవ బహుమతి: రూ. 500-00**
**మూడవ బహుమతి: రూ. 300-00**

మేం ప్రచురించనున్న ఆదివారం వారపత్రికలో ఉన్నత ప్రమాణాలు గల వైవిధ్యమున్న కథలను అందించే నిమిత్తం కథలపోటీ నొకదాన్ని నిర్వహించ తలపెట్టాం. రచయిత(త్రు)లను ఈ పోటీలో ఉత్సాహంగా పాల్గొనవలసిందిగా ఆహ్వానిస్తున్నాం.

పోటీలో పాల్గొనడానికి నిబంధనలు

1. కథ 10 అరఠావు పేజీలకు మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. అనువాదాలు అనుకరణలు పంపకూడదు.
3. పోటీకి పంపిన రచనలను తిప్పి పంపడం జరగదు.
4. కవరుమీద 'ఆదివారం కథల పోటీకి' అనిస్పష్టంగా రాయాలి. గడువుతేదీ దాటిన తర్వాత చేరిన రచనలు పోటీకి తీసుకోబడవు.
5. బహుమతి పొందిన రచనల విషయం ఆయా రచయితలకు తెలియచేస్తాం. బాగున్న కథలను సాధారణ ప్రచురణకు స్వీకరిస్తాం. ఆ కథలజాబితా పోటీ ఫలితాలతోపాటు ప్రకటిస్తాం.
6. కలంపేరు పెట్టుకున్నా, రచయిత తన అసలు పేరును తెలియచేయాలి.
7. కథల ఎన్నిక విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఉత్తరప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.

**కథలు మాకు చేరవలసిన ఆఖరు తేదీ: 26 డిసెంబరు 1980**

పూర్తి ఆఫ్‌సెట్
సైజు: 1/4 డెమ్మీ
వెల: రూపాయి

ఫోన్: 220989

# ఆదివారం

కాకతీయ పబ్లికేషన్స్

5-8-55/A, నాంపల్లి స్టేషన్ రోడ్, హైదరాబాద్-500001

Ranga

# ఇంటా లేదా విదేశాల స్త్రీలందరూ విశ్వసించేది హెలెన్ కర్టిస్‌వారి షాంపూలు






మెరికా, యూరప్, జపాన్, రతదేశంలో...స్త్రీలందరూ ష్టపడేవి హెలెన్ కర్టిస్ వారి షాంపూలు..ఎందు కంటే వారి జుట్టుకు సరిపోయే పోషణ, గనిగలు, తళతళలు కేవలం హెలెన్ కర్టిస్ వారు మాత్రమే ఇవ్వగలరని వారికి బాగా తెలుసు. భారతదేశంలో, మీ జుట్టుకి హెలెన్ కర్టిస్ వారి టియారా ట్రీట్‌మెంట్ ఇవ్వండి. టియారా షాంపూలు ఏరకమైన జుట్టుకైనా సరిపడేలా తయారు చేయబడ్డాయి.

● టియారా ఎగ్ షాంపూ : తగిన పోషణ లేని జుట్టు కోసం.

● టియారా షీకాకాయ్ షాంపూ : నిడుపాటి జుట్టు కోసం, ఆమ్లా మరియు బ్రాహ్మిలతో.

● టియారా బ్యూటీషాంపూ ఒత్తైన జుట్టుకు, ఎక్కువ నురగతో మృదుత్వాన్ని చ్చేది.

## టియారా షాంపూ
హెల్త్ మరియు బ్యూటీ షాంపూలు





'కేశసంరక్షణ విషయాలలో ప్రపంచ నాయకులు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938 1972]

శుక్రవారం : 26-12-'80
రౌద్రినామ సం. మార్గశిర బ. పంచమి
సంపుటము 74 సంచిక 15

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

దేశంలో ఏడాది చందా రు. 54-60
ఆరు మాసాల చందా రు. 27-30
విడి ప్రతి వెల ఒక రూపాయి
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

అట్టమీది బొమ్మ
నటి సులక్షణ

## హైదరాబాద్ నోట్‌బుక్

### రెండు గేయ కావ్యాలు !

ఇరవై యేళ్ల నాడు మద్రాసులో శ్రీ ఇ. ! రామస్వామి నాయకర్ రామాయణ దహనోద్యమ ప్రారంభించినప్పుడు వీరులు భయపడి పోయి రాజాజీకి మొర పెట్టుకొన్నారు. రామాయణం పుస్తకాలు కాల్చివేస్తే రామకథ అంత మవుతుందా? దానికి రామాయణ ప్రచారోద్యమం ప్రారంభిద్దాము— అని రాజాజీ చక్రవర్తి తిరుమగన్ అనే పేర కొత్త పద్ధతిలో రామాయణం అతి సరళమైన తమిళ భాషలో వ్రాశారు. మద్రాసు నగరం ప్రతి వీధిలోను శ్రీ అనంతరామ దీక్షితర్‌తో వాల్మీకి రామాయణం పురాణ కాలక్షేపం ఏర్పాటు చేశారు. ఆ కాలక్షేపంలో శ్రోతలలో అగ్రశ్రేణిలో రాజాజీ, ఖాసా సుబ్బారావు మున్నగు వారు ఉండేవారు. చక్రవర్తి తిరుమగన్ మూడు నాలుగు లక్షల ప్రతులు హాట్ కేక్స్‌లాగ అమ్ముడు పోయాయి. రామాయణం వాల్మీకి అన్నట్లు ఈ పర్వతాలు, నదులు వుండే వరకు వుంటుంది. దాని శక్తి అలాటిది. రామాయణం పై ద్వేషం కుమ్మరించిన రాష్ట్రంలోనే దాని ప్రాచుర్యం అలాటి దయినప్పుడు రాముడంటేనే పరవశించే తెలుగు నాడులో చెప్పనక్కర లేదు. పాఠ్యే గేయే చ మధురం— అని వాల్మీకి అన్నదానికిలక్ష్యంగానా అన్నట్లు ఇటీవల తెలుగులో రామకథా కావ్యాలు పుంఖానుపుంఖంగా రావడానికి కారణం రాముని ఎడల గల భక్తి తత్పరతే. ఆ తత్పరతతోనే లోగడ సుందరకాండ గేయంగా రచించిన 'రామదర్శన ప్రభాసి' శ్రీ మారం పూడి రాధాకృష్ణమూర్తి రచించిన బాలకాండం గేయ కావ్యావిష్కరణం నవంబరు 21 న శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో జరిగింది అధ్యక్షత శ్రీ కోకా రాఘవరావు, కావ్యాన్ని ఆవిష్కరించిన ప్రధాన న్యాయమూర్తి శ్రీ అల్లాడి కుప్పుస్వామి ,ముఖ్య అతిథి రావూరు సత్యనారాయణరావు, వక్తలు శ్రీయుతులు ఎం. ఎస్. కె. శాస్త్రి, పోతుకూచి సాంబశివరావు, జి. కె. భగవాన్, వడ్లమాని సోమసుందరం, నిడుమోలు కేశవరావు, అవ్వా సత్యనారాయణరావు మున్నగు వారు శ్రీ రాధా కృష్ణమూర్తి న్యాయవాది అయినా సాహిత్యాభిరుచి తోను, సరళ శైలిలో రామాయణ గేయ కావ్య రచనకు పూను కోడం ప్రశంస నీయమన్నారు. ఈ రామాయణ గేయ కావ్య రచనను ఉచితంగా ముద్రించి ఇచ్చిన పంచాయితీరాజు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు శ్రీ చండిక సాంబశివరాజు గారిని, తమ గురువులు డాక్టర్ అక్కిరాజు రమాపతిరావుగారిని రచయిత సత్కరించారు. తాను విద్వాంసుణ్ని కానని, తన రచనకు ప్రేరణ రాముడే నని రచయిత సవినయంగా కృతజ్ఞత తెలిపారు శ్రీ పటానేని రామచంద్రరావు మధురంగా కావ్యగానం చేసిన మీదట భాషా నిలయం కార్యదర్శి శ్రీ ఎం. ఎల్. నరసింహారావు కృతజ్ఞతా వందనాలతో ఆవిష్కరణోత్సవం సమాప్తమైంది

సికిందరాబాద్ విద్యాశాఖాధికారి శ్రీ యాంసాని విష్ణు జనార్దన్ రచించిన సాయి సచ్చరిత్ర సుధా గానము అనే గేయ కావ్యం ఆవిష్కరణ నవంబరు 22 న సికిందరాబాద్‌లోని గుజరాతీ సేవామండలిలో జరిగింది. షిరిడీ సాయిబాబా మహాయోగి. 19వ శతాబ్దం ప్రారంభంలోను, ఈ శతాబ్దం ప్రథమ పాదంలోను ఆ మహామహుడు సంఘానికి చేసిన సేవ అసదృశం. మత సామరస్యానికి మానవ మనః పరిపాకానికి ఆయన జీవితం ప్రత్యక్షంగాను పరోక్షంగాను వినియోగ పడింది. ఋషీణాం పునరాద్యానాం అన్నట్లు ఆయన మాటలు సత్యాలయ్యేవి. ఆయన చూపులు, స్పర్శలు రోగాలను పటాపంచలు చేసేవి. ఆయన కరుణార్ద్ర దృష్టి కోసం, ఆయన మంచి మాట కోసం మహా మేధావులు పడిగాపులు కాచేవారు. యమేవైషవృణుతే తేనలభ్యః, తస్యైష ఆత్మా వివృణుతే తనూంస్వాం. అన్నట్లు భగవదనుగ్రహంతో విశ్వరహస్యాన్ని, విశ్వస్రష్ట రహస్యాన్ని ఆకళించుకొన్న మహాజ్ఞాని సాయిబాబా. ఆయన దివ్యలీలలు సహస్రాధికాలు, వాటిలో దాదాపు ఐదు వందలను శ్రీ విష్ణు జనార్దన్ పొందు పరుస్తూ ఈ గేయ కావ్యం రచించారు. యతిర్వాప్రాసోవా — అన్న పాల్కురికి సోముని సూక్తిని అనుసరించి శ్రీ విష్ణు జనార్దన్—

సద్భక్తుండగు— శ్యామా నా మది
దెలిపిన సాయీ — దివ్యకథ, వే
బలికెద షిరిడీ — బాబకథ

అని రచనా ప్రారంభమయిన మకుటంలోను,

"కాళ్లకు మువ్వలు — కట్టి సొగసుగా
అందము లొలుకగ — సుందరమూర్తి
భగవంతుని సౌ—భాగ్యముపాడుచు
నాట్యము చేసెను—నవ్యరీతుల"

యతిని, ప్రాసయతిని పాటించి నిష్ఠతో పూర్తి చేశారు ఆవిష్కరణోత్సవానికి అధ్యక్షత వహించిన మహాకవి డాక్టర్ బోయి భీమన్న [ఎం. ఎల్ సి.] కావ్యాన్ని ఆవిష్కరించిన శ్రీ దేవులపల్లి రామానుజరావు, కావ్యపరిచయం చేసిన శ్రీయుతులు తిరుమల రామచంద్ర, ఉత్పల సత్యనారాయణ చార్యులు, శుభాకాంక్షలు తెలిపిన డాక్టర్ టి వి. నారాయణ [పబ్లిక్ సర్వీస్ కమిషన్ సభ్యులు], సాంబమూర్తి, మున్నగువారు శ్రీ విష్ణు జనార్దన్ రచనా చాతుర్యాన్ని, భక్తితత్పరతను, కావ్య విశేషాలను వివరిస్తూ ప్రశంసించారు పెక్కుసంస్థలు రచయితను శాలువలతో సత్కరించాయి. రచయితను సాయి సచ్చరిత్ర సుధాగానము రచించడానికి గల కారణాలను వివరించిన మీదట శ్రీ చివుకుల సత్యనారాయణమూర్తి కావ్యగానం చేశారు. శ్రీ ఎస్. వి. సుబ్బారావు వందన సమర్పణ చేశారు. ఈ రెండు గేయ కావ్యాలూ వాటి ఇతివృత్తబలంతోను, రచనా రామణీయకంతోను జనాదరం పొందగలవనే విశ్వసిస్తున్నాను.

### ఉపశ్రుతి !

తాను, అతడు సతీర్థ్యులని అంటున్నారు వక్త. సతీర్థ్యులంటే ఏమిటండీ ? అని ఒక సభావేశంలో నన్నొక శ్రోత అడిగాడు ఆయనకు వివరించబోతున్నాను. అంతలోనే ప్రక్కనవున్న పెద్దమనిషి ఒకరన్నారు— తీర్థమంటే తెలీదటండీ ? మన నాయకులూ, పెద్దలూ రోజూ పుచ్చుకునేది, నేనూ,ఆయనా కలిసిపుచ్చుకొనేవాళ్లం అని అర్థం— అన్నారు. నేను అవాక్కయివుండిపోయాను.

—తిరుమల రామచంద్ర



# 21 లక్షల క్రొత్త వ్యక్తులు గత సంవత్సరం డెట్ బిళ్లను వాడారు

# దీనికి ఒక ప్రబల కారణం వుంది– డెట్ యొక్క ఉజ్వలమైన ఉతుకు

ఇప్పుడు మునుపటికంటే ఎంతో ఎక్కువ మంది డెట్ బిళ్ల యొక్క ఉజ్వలమైన ఉతుకును ఇష్టపడుతున్నారు, వారంటారు; ఇది మిరుమిట్లు తెలుపును, ఎంతో ఎక్కువ పొదుపును ఇస్తుంది.

| అత్యుత్తమ డిటర్జెంట్ బిళ్ళల వృద్ధి | |
|---|---|
| | క్రొత్త గ్రాహకులు |
| డెట్ బిళ్ల | **21,00,000** |
| రెండవ ఉత్తమ బిళ్ల | **14,00,000** |
| మొత్తము 49,00,000 క్రొత్త గ్రాహకులు | |
| మూలం: రిటైల్ స్టోర్ ఆడిట్ రిపోర్ట్: జనవరి-డిసెంబర్, 1979<br>వాడకపు ఆధారం: 1 బిళ్ల, ప్రతి నెల, ప్రతి వ్యక్తి | |

21,00,000 క్రొత్త వ్యక్తులు డెట్ బిళ్లను వాడడం మొదలెట్టారు.
మరి మీరు?




## డెట్ బిళ్ల

వాడండి
తెలుపును పొందండి

Shilpi-DM-14A/80 Tel

# సీరియల్

# రాగలహరి

శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్

## 6

(గత సంచిక తరువాయి)

శ్రుతికి మూడో ఏడు వచ్చింది.

ఆ రోజు మళ్లీ సరిగ్గా శ్రుతి పుట్టినరోజు వచ్చింది. అప్పటికి, ఇప్పటికి ఎంత మార్పో అనుకుంది పల్లవి.

ఎప్పటిలాగే జరిపింది పల్లవి.

ఇంకా పెద్ద ఎత్తున ఏర్పాట్లు చేసింది. ఇప్పుడు చేతికింద ఇద్దరు పనివాళ్లే గాక వంట మనిషి కూడా వుంది!

పల్లవి కే శ్రమా లేకుండా అంతా వాళ్లే చేసుకుపోతున్నారు.

తలంటి పోసుకుని కొత్త గౌను తొడుక్కున్న శ్రుతిని చూశాక, పుట్టినరోజు సంగతి గుర్తొచ్చింది చరణ్ కి.

"బావుందమ్మా! చాలాబావుంది!" అన్నాడు నవ్వి.

"నాన్నా! మరి హాపీ బర్త్ డే చెప్పవేం?" అడిగింది శ్రుతి.

"ఓ ...! మర్చిపోయానమ్మా! హాపీ బర్త్ డే..." గట్టిగా నవ్వాడు.

కిందటి రోజు షాపింగ్ కి వెళ్దామంటే, "నాకు టైమ్ లేదు పల్లవీ! నువ్వూ పాపా వెళ్ళండి." జేబులోంచి డబ్బు తీసి యిస్తూ అన్నాడు.

నిరుత్సాహంగా అందుకుంది పల్లవి.

ఆ తరువాత తనని తనే సంభాళించుకుని పాపతో బజారెళ్లింది.

వారం రోజులుగా 'ఇవాళ-రేపు' అంటూ వాయిదా వేసి, ఇవాళ ఒక్కదాన్నే వెళ్లమన్నాడు.

ఎంత వద్దనుకున్నా ఆలోచనలు రాకుండా వుండవు అనుకుంది పల్లవి. బంగారు రంగు నైలెక్స్ గౌను కొన్నది. పట్టుపరికిణీ పీసు కొన్నది ముదురాకు పచ్చరంగుది బంగారం రంగు బార్డర్. టైలరు మొదట ఒక్క రోజులో కుట్టలేనన్నాడు. డబుల్ చార్జి పే చేస్తానంటే ఒప్పుకున్నాడు. అవి చూసి శ్రుతి ఎంతో సంబరపడింది. పాప ఆనందం చూస్తూ తన అసంతృప్తిని మర్చిపోయింది పల్లవి.

కానీ, పిల్ల పుట్టినరోజునాడు కూడా డైనింగ్ టేబిల్ మీద కూర్చుని ఆఫీసు విషయాలే ఆలోచిస్తున్న భర్తని చూస్తే చిరాకేసింది పల్లవికి కానీ పైకేమీ అనలేదు.

దగ్గరుండి అన్నీ వడ్డించింది — తండ్రీ కూతుళ్లకి! ఏం వండిందో ఏం తింటున్నాడో కూడా గమనమే లేదు చరణ్ కి!

బుల్లి వెండి కంచంలో అన్నం తింటూ ఏవేవో కబుర్లు చెప్తోంది శ్రుతి! అసలే చురకైన శ్రుతికి జ్ఞాపకశక్తి కూడా ఎక్కువే! "నాన్నా నన్ను స్కూల్లో ఎప్పుడు చేరుస్తావు?" అడిగింది. ఎప్పుడో మాటల సందర్భంలో పల్లవితో అంటుంటే విన్నది శ్రుతి, మూడోఏడు రాంగానే స్కూల్లో చేర్చాలి అని! అందుకని అడిగింది తండ్రిని!

"రేపు" అనేశాడు చరణ్

తండ్రి ఆఫీసు వెళ్తుంటే టా-టా చెప్పింది. యథావిధిగా పేరంటం చేసింది పల్లవి.

ఈసారి పేరంటం చిన్న పార్టీ లాగా జరిగింది. కేక్ కూడా కోయించింది శ్రుతిచేత! అంతా బాగా జరిగింది. కవర్లల్లో ఈసారి స్వీటూ, హాటూ, పండు, తాంబూలంతో బాటు చిన్న చిన్న కుంకుమ బరిణెలు కూడా వేసి పంచింది పల్లవి!

పేరంటమయి అందరూ వెళ్ళాక, గంట సేపు ఎదురుచూస్తూ కూర్చున్నారు చరణ్ కోసం పల్లవీ, శ్రుతీ. శ్రుతికి బట్టలు కూడా మార్చకుండా అతడికి చూపించాలని ఎదురు చూస్తూ కూచుంది తను.

దానికేమో చికాకు, నిద్ర, ఏడుపు చాలా ఆలస్యంగా వచ్చాడు చరణ్.

అనుకోకుండా అర్జంటు పని వచ్చి పడిందనీ, పక్క వూరు వెళ్లాల్సి వస్తుందనీ చెప్పాడు వస్తూనే! ఆలస్యంగా వచ్చిన భర్త మీద కోపం వచ్చింది పల్లవికి.

"మీ పనులూ, మీ క్యాంపులూ ఎప్పుడూ వుండేవే. పిల్ల పుట్టిన రోజు కదా! తొందరగా వస్తే ఎంత బావుండేది? అదేమో మీకు చూపించాలని ఎంతో సరదా పడింది. ఎదురు చూసి ఎదురు చూసి ఇప్పుడే నిద్రపోయింది"

"అయితే నాకు ప్రేమ లేదంటావా? ఊరికే తిరుగుతున్నా నంటావా? అనవసర లక్షపన్ను. నీకేమర్థమవుతుంది. ఇంట్లో కూచునేదానివి. సర్వెంట్లుండి అన్నిపనులూ చేస్తుంటే కబుర్లెన్నన్నా చెప్తావు. ఏదో ఈ ఉద్యోగం వల్లనే ఈ మాత్రం వున్నాం. పోనీ రిజైన్ చెయ్యమంటావా చెప్పు?"

అసలే అలసి వచ్చిన చరణ్ ఇంకా కోపంగా అన్నాడు. ఏం మాట్లాడలేదు పల్లవి. ఎందుకు! రెండు చేతులూ కలిస్తే చప్పట్లేగా? మౌనంగా లోపలికి వెళ్లిపోయింది. శ్రుతి అలంకరణతోనే నిద్రపోతోంది.

చరణ్ మౌనంగా శ్రుతి పక్కన కూచుని నిద్రపోతున్న శ్రుతి మొహంలోకి చూస్తూ వుండిపోయాడు కొంతసేపు

అన్నం వడ్డించి రమ్మంది పల్లవి లేచాడు మవునంగానే.

**జరిగినకథ — 2 :** ఆదర్శ దాంపత్య జీవితం సాగిస్తున్న చరణ్, పల్లవిలకు సంవత్సరాలు గడుస్తున్నా పిల్లలు కలగక పోవటంతో, బంధువుల దృష్టంతా వాళ్ళ మీదే వుండేది. కొంత కాలానికి పల్లవికి 'గొడ్రాలు' అన్న పేరు స్థిరపడి పోయింది. ఓ శుభ ముహూర్తాన ఆమె కడుపు తొందన్న వార్త ఆ దంపతులను ఆనంద పరచినా, బిడ్డనెత్తుకునే వరకూ నమ్మకం లేదేమో! అన్న అనుమానం వాళ్లని విచార సాగరంలో ముంచెత్తుతూ వుంటుంది. చరణ్ పల్లవిలకు పుట్టిన పాపకు 'శ్రుతి' అని పేరు పెట్టుకొంటారు. చరణ్ కి ప్రమోషన్ రావటంతో చాలా బిజీ అయి పోతాడు.

''నువ్వా కూచో'' అనలేదు చరణ్. తను కూచోనూలేదు.

నిద్రపోతున్న శృతికి నిద్రాభంగం కలగకుండానే బట్టలు మార్చింది పల్లవి. నగలు తీసేసింది. బెడ్ రూములో పడుకోబెట్టి ఫ్యాన్ వేసింది. మళ్ళీ వంటింట్లోకి వచ్చింది. వేసిందేదో తిని లేచాడు చరణ్.

తను అభోజనంగా పడుకోకూడదని ఏదో తిన్నాననిపించి, అన్నీ సర్దుకుని బెడ్‌రూములోకి వచ్చింది పల్లవి.

పనివాళ్ళున్నా వడ్డన మాత్రం తనదే! పల్లవి తప్ప ఇంకెవరు వడ్డించినా చరణ్ తినలేదు.

కళ్ళు మూసుకుని అటుతిరిగి పడుకోనున్నాడు చరణ్. పక్కన కూర్చొని అతడి మీద చెయ్యేసింది పల్లవి.

''ఇవాళ శృతి పుట్టినరోజు. మనం నవ్వుతూ వుండాలి'' అంది పల్లవి. తన ఫీలింగ్సుని దిగమింగుకుని లాలనగా.

చరణ్ ఇటుతిరిగి ''పల్లూ'' అన్నాడు!

## 7

ఒక మంచిరోజు చూసి శాస్త్రోక్తంగా అక్షరాభ్యాసం చేయించారు శృతికి. బీద పిల్లలకు పలకలు, బలపాలు, కొత్త బట్టలు కూడా ఇచ్చారు చరణ్, పల్లవీను. అక్షరాభ్యాసం చేయించిన బ్రాహ్మణ పండితుడికి పట్టు బట్టలు పెట్టారు. దక్షిణ తాంబూలాలు ఇచ్చారు! ఆయన ఎంతో సంతోషించాడు. వాళ్ళిద్దర్నీ, పిల్లనీ ఆశీర్వదించాడు.

చేర్పించింది ఇంగ్లీషు మీడియం స్కూల్లోనే అయినా అక్షరాభ్యాసం మాత్రం 'ఓం నమః శివాయః' అతోనే చేయించారు. శృతి ఎంతో ముద్దుగా శ్రద్ధగా అక్షరాలు దిద్దింది. ఆ రోజే స్కూల్లో కూడా చేర్చారు.

నీలం కాన్వెంట్ డ్రెస్, బాబ్డ్ హెయిరూ, తెల్లసాక్సూ, నల్లబూట్లు వేసుకుని స్కూలుకెళ్ళడానికి తయారయింది శృతి.

పల్లవి తనూ చక్కగా తయారై వచ్చింది. మొదటి రోజు కాబట్టి ఇద్దరూ కలిసి వెళ్ళి శృతిని స్కూల్లో దించి రావాలని ముందే నిర్ణయించుకున్నారు పల్లవీ, చరణ్ కూడా!

పల్లవి లోపల్నించి రెడీ అయి బయటికి వచ్చేటప్పటికి, చరణ్ హడావిడిగా లోపలికి వస్తూ ఎదురయ్యాడు.

''ఏమిటి! ఏం కావాలి?'' అడిగింది పల్లవి.

''ఏంలేదు... ఏంలేదు...'' గదిలోకి దూసుకు వెళ్ళాడు. వెనకే తనూ వెళ్ళింది. బల్లమీద దేనికోసమో వెతుకుతున్నాడు. అర్థంగాక చూస్తూ నిల్చుంది.

బయట్నించీ శృతి ''అమ్మా నాన్నా'' అని గట్టిగా పిలుస్తోంది.

''ఉండమ్మా! వస్తున్నాను''అని, ''ఏమిటి చెప్పండి, ఏం కావాలి మీకు ?'' అనడిగింది మళ్ళీ పల్లవి.

''ఇక్కడా అర్జెంట్ కాగితం ఒకటి పెట్టాను. కనబడ్డంలేదు. అదిపోతే... నా పీకలమీది కొస్తుంది.''వెతుకుతూనే అన్నాడు.

అదేం కాగితమో తెలియకపోయినా తనూ వెదకడం ప్రారంభించింది పల్లవి.

ఒక పావుగంట గడిచాక ''ఇదిగో ఇక్కడే వుందిలే'' అని జేబులో పెట్టుకున్నాడు.

''సారీ పల్లవీ! నిన్ను శ్రమ పెట్టాను. ఇప్పుడు నేను అర్జంటుగా ఆఫీసు కెళ్ళాలి. ప్లీజ్, ఏమనుకోకు. పాపని నువ్వు తీసుకు వెళ్ళు స్కూలికి. సరేనా? ప్లీజ్, ఏమనుకోవుగా ? అట్లా చూడకు ... కోపం వద్దూ? ఆల్ రైట్'' అంటూనే గుమ్మం దాటాడు.

''పల్లవీ! నేను ఆటోలో వెళ్తాను. మీరు కారులో వెళ్ళండి.'' బయటినించి అన్నాడు.

నిరాశగా, నిస్సత్తువగా నిలబడి పోయిన పల్లవి! ఇట్లాంటిది ముందే జరుగుతుందని



పూహిస్తూనే వుంది. ఊహిస్తున్నదే అయినా కాసేపు అయోమయంలో పడిపోయింది.

కానీ, అంతలోనే లేని సత్తువ తెచ్చుకుని వాకిట్లోకివచ్చి "వద్దు. మేము ఆటోలో వెళ్తాం. మీరు కారు తీసికెళ్ళండి. రామ్మా శృతీ" పాప చెయ్యి పట్టుకుంది.

ఎంతో ఉత్సాహంగా కారెక్కి ముందు సీట్లో కూర్చునివున్న శృతి మెల్లగా కారు దిగింది.

"సారీ శృతీ డార్లింగ్. ఇంకో రోజు వస్తాగా మీ స్కూలుకి? ఓ... కే...? ఏదీ నవ్వు" చరణ్ అన్నాడు పాపతో.

తలూపుతూ బొమ్మలా నవ్వింది పాప. కారు స్టార్టు చేస్తూ చెయ్యూపాడు చరణ్.

'టా– టా' చెప్పింది శృతి. కారు వెళ్ళిపోయింది. దీర్ఘంగా నిట్టూర్చింది పల్లవి తన భావాలన్నీ లోలోపలే అణచుకుంది.

"అమ్మా! రా అమ్మా. స్కూలు టైమవుతోంది." చెయ్యి పట్టి లాగింది పాప.

ఇల్లు తాళం పెట్టి బయలుదేరింది పల్లవి.

ఆటోలో కూర్చున్నా అన్యమనస్కంగానే వుంది. పాపకి మాత్రం సంతోషంగా వుంది. స్కూలుకి వెళ్తూనే తన చికాకంతా మాయమైంది పల్లవికి.

చిన్న చిన్న పిల్లలు శృతి క్లాసులో బ్లూ డ్రెస్‌లో ఎంతో ముద్దుగా వున్నారు.

ఏదో సినిమా పాటలాగా, నెమళ్ళలాగే వున్నారు వాళ్ళు! అంతా ఇంగ్లీషే! ముద్దు ముద్దుగా మాట్లాడుతున్నారు.

టీచరు, హెడ్ మిస్ట్రెస్ ఎంతో బాగా మాట్లాడారు. వాళ్ళందర్నీ చూస్తుంటే తనుగూడా టీచరయిపోతే బావుండుననిపించింది పల్లవికి.

* * *

"ఏమిటి పల్లవీ! ఏడుకున్నావేం? అలకా?"

'ఆ రోజులు పోయాయి.' అనుకుంది పల్లవి. పైకేం మాట్లాడలేదు. లేచి వంటింట్లోకి నడిచింది. భోజనంవడ్డించింది.

"ఏట్లా వుంది స్కూలు?" అడిగాడు భోజనానికి ఉపక్రమిస్తూ!

"బావుంది" పొడిగా అంది పల్లవి.

"ఏమిటోయ్ సరిగా మాట్లాడవు? ఏమిటి స్కూలు సంగతులు చెప్పు?"

"ఏం మాట్లాడను? సంగతులేమున్నాయి?"

## రాగలహరి

చరణ్ ఈ మధ్య మరీ అధ్వాన్నమయిపోతున్నాడు. పత్రం భోజనం, మఠం నిద్ర లాగా భోజనానికి, పడుకోడానికీ మాత్రమే ఇల్లులాగా వుంది.

ఒక్క సరదాలేదు, ఉత్సాహమూ లేదు. ఎంత సరి పెట్టుకుందామన్నా విసుగ్గానే వుంది పల్లవికి. తనకి సంతోషం వచ్చినా, ఉత్సాహం వచ్చినా అతడితో పంచుకునేది ఇదివరకు. అప్పుడది ద్విగుణీకృత మైనట్లుండేది. ఏదన్నా బాధ వస్తే అతడితో పంచుకుంటే అదీ సగం తగ్గినట్లు వుండేది. కానీ, ఇప్పుడట్లా కాదు. తను పంచుకుందామన్నా — అతడు వినిపించుకోడు. వినిపించుకున్నా సీరియస్‌గా తీసుకోడు. పరధ్యాన్నంగా వుంటాడు. లేకపోతే తేలిగ్గా తీసిపారేస్తాడు.

## ధర వీరులం!

ఆశాజీవుల ఆశయ పంచుల చిల్లులం!
సామాన్యుని గుండె గుభేలులం!
డొక్కలు ఎండినా, దిక్కులు మండినా;
అవినీతి అంతరించనంత కాలం—
అక్రమదార్ల 'చీకటికౌగిళ్ళ'కు అంకితులం!
'ఆర్యభట్ట' 'రోహిణి'ల ముందే
అంతరిక్షాన్ని అధిరోహించాం!
అదుపులేని, ఎదురులేని
అధిక ధరలం!!
అన్ని రోజులకు రారాజులం!
మేమే ధర వీరులం!!

— "శిరీష"

అందుకే తన భావాలన్నీ తనలోనే దాచుకుంటోంది పల్లవి.

"ఏమిటోయ్! ఆలోచన? పెరుగు వెయ్యి..." చరణ్ మాటలకి పల్లవి ఈ లోకంలోకి వచ్చి పెరుగు వేసింది. భోజనమయి లేచాడు చరణ్. వంటిల్లు సర్ది వచ్చింది పల్లవి.

"చూడు పల్లవీ! నువ్వు ఎక్కువగా ఆలోచించడం మానెయ్యి." ఆశ్చర్యంగా చూసింది పల్లవి.

"అవును. ఆలోచనలే బుర్రని పాడు చేసేది. నీకీ ఆలోచనలెందుకో తెలుసా? నీకొక వ్యాపకమంటూ లేకపోవటం వలన. నేనో మాట చెప్పనా? నువ్వేమీ అనుకోనంటేనే! నువ్వు... బి ఇడి. లో చేరు. బి. ఇడి. పూర్తి చేసి, టీచరుగా ఏస్కూలులోనన్నా చేరమ్మ. లేదా ఎమ్. ఏ. కి ప్రైవేటుగానన్నా కట్టు. ఏదన్నా చదువో, ఉద్యోగమో వుంటే నీకూ, మనసుకి హాయిగా వుంటుంది. లేకపోతే నువ్విట్లా ఏదో ఆలోచిస్తూ పరధ్యానంగా, విచారంగా వుండడం ఎందుకు చెప్పు? నీకేం తక్కువయిందనీ? మంచి ఇల్లూ, నౌకర్లూ, చాకర్లూ, పండు లాంటి పిల్లా, నిన్ను ప్రాణంగా చూసుకునే భర్తా. ఇవన్నీ ఎందరికి వుంటాయి, నువ్వే చెప్పు? నువ్వెంతో హాయిగా, ఆనందంగా వుండచ్చు కూడా.

ఇంకా నన్నడిగితే, శృతిని బోర్డింగ్ స్కూల్లో పెడదామని వుంది నాకు, కొన్నాళ్ళయినాక!" అన్నీ చిత్రంగా వింటున్న పల్లవి ఉలిక్కి పడింది.

"శృతినా? బోర్డింగ్ స్కూల్లోనా? ఎందుకు? నేనేం చెయ్యను ఇక్కడ?"

"చెప్పేదంతా వినలేదూ? నువ్వు చదువుకుందువుగాని..."

"నాకిప్పుడు చదువూ అక్కరలేదు. ఉద్యోగమూ అక్కరలేదు. నా పిల్లని నేను చేతులారా పెంచి పెద్ద చేసుకుంటాను. అదే నాకు ముఖ్యం. తల్లీ, తండ్రీ ఉండి కూడా లేనివాళ్ళలాగ అదెక్కడో పెరగడం ఎందుకు?"

"అదేమిటి పల్లవీ, బోర్డింగ్ స్కూల్లో చదివేవాళ్ళు తల్లీతండ్రీ లేనివాళ్ళనా నీ అర్థం?"

"అదేమిటో నాకు తెలీదు. నా చేతులారా అన్నం కలిపి నోట్లో పెడితే గానీ నాకు తృప్తి వుండదు. పాపని నా ఒళ్ళో నిద్రపుచ్చితే గానీ నాకు నిద్ర రాదు. ఈ మధ్య... ఈ మధ్య దానికి తండ్రి ఆప్యాయత కూడా కరువవుతోంది. ఇంక నేను కూడా వుండీ లేనట్టుగా వుండలేను."

"ఏమిటి నువ్వనేది? నీకేమన్నా పిచ్చెక్కుతోందా?"

"అవునా, ఎక్కేటట్లేవుంది. పిచ్చి ఎక్కినా బావుండును. మీ ధోరణీ, మీ ఉద్యోగమూ నాకు అంతుపట్టకుండావున్నాయి. ఈ ప్రపంచంలో ఇంకెవ్వరూ ఉద్యోగమే చెయ్యడంలేదా? అందరూ భార్యాపిల్లల్నిట్లా వదిలేస్తున్నారా? వాళ్ళకింత తిండి పడేసున్నాం చాలనుకుంటున్నారా?


BONDED LEAD HB * 621 * NATARAJ * H.P.P.LTD

మీరు నాతోగానీ, పిల్లతోగానీ ఆప్యాయంగా మాట్లాడి ఎన్నాళ్ళయింది? పాపని దగ్గిర పడుకోబెట్టుకుని, ముద్దాడి ఎన్ని రోజులయింది? దాంతో ఆడుకుని ఎంత కాలమయింది? అసలివి మీకు ఆలోచనలోకి రావు కదూ? నాన్నంటే హడావిడిగా వుంటారు, బిజీగా వుంటారు, ఆఫీసులో వుంటారు అని తప్పితే... పాపం! ఆ పిల్ల మీవైపు ఎట్లా భయం భయంగా చూస్తుందో ఈ మధ్య ఎప్పుడైనా గమనించారా? మీకు చికాకు, కోపం, విసుగు ఎక్కువయ్యాయి అని తెలుస్తోందా మీకు ?

ధనానికీ, హోదాకీ దేనికీ లోటు లేదు. నిజమే. సోఫాసెట్లూ, గాడ్రెజ్ బీరువా, గాస్స్టవ్, కారూ, ఫ్రిజ్, స్కూటరూ అన్నీ కొన్నారు పిలిస్తే పలికే పనివారూ వున్నారు కాదనను. కానీ! ఇవన్నీ నాలోని అశాంతినీ, మన మధ్య దూరాన్నీ పెంచుతున్నాయి.''

ఇన్నాళ్ళనించీ దాచుకున్న బాధంతా మాటల రూపంలో బయటి కొచ్చేసింది, పల్లవికి తెలియకుండానే! పల్లవినీ, ఆమె మాట తీరునీ చూస్తుంటే భయం వేసింది చరణ్ కి

''ఏమైంది పల్లూ? ఎందుకు ఇంతగా బాధపడుతున్నావ్? నాలో తప్పు ఇదీ అని చెప్పు సరిదిద్దుకుంటాను నువ్వు బాధ పడుతుంటే నేను చూడలేను పల్లూ!'' అనునయిస్తూ దగ్గిరకి తీసుకున్నాడు ఆమెని.

## రాగలహరి

''నిజమే నేను ఎక్కువకాలము మీతో స్పెండ్ చెయ్యలేకపోతున్నాను ఇకనించీ మీతో ఎక్కువ సమయం గడపడానికి ప్రయత్నిస్తాను నన్ను క్షమించు పల్లూ ప్లీజ్ ''

మౌనంగా వుండిపోయింది పల్లవి.

### 8

అన్నట్టుగానే చరణ్ మారకపోయినా, కొన్నాళ్ళు కుటుంబాన్ని ఎక్కువ శ్రద్ధగానే చూస్తూ వచ్చాడు పల్లవి కూడా ఇదివరకటంతగా బాధ పడుతూ కూచోక ఆ జీవితానికి అలవాటు పడిపోయింది క్రమంగా.

మనసుని మరో వేపు కి మళ్లించుకుంటోంది పుస కాలు చదువుకోవటం ఒక హాబీగా చేసుకుంది తోటపనిలో కొంతకాలం గడుపుతోంది కొన్ని కుట్లూ — అల్లికలూ నేర్చుకుంది

శ్రుతి రోజూ ఏ పేచీ లేకుండా స్కూలికి వెళ్ళివస్తోంది

మరో రెండు సంవత్సరాలు గడిచిపోయాయి పాప లోయర్,అప్పర్ నర్సరీలు పూర్తిచేసి ఒకటవ తరగతిలోకి వచ్చింది

టీచర్లందరికీ శ్రుతి అంటే ప్రత్యేకత. చదువులోనూ,ఆటపాటల్లోనూ అన్నిట్లోనూ చురుకే శ్రుతి !

స్కూలు, చదువు అంటే పాపకి ప్రాణమే! పాప నర్సరీ రైమ్స్ పాడుతుంటే తనూ పాడేది పల్లవి

పాప చేత పాడించి, టేప్‌రికార్డర్‌లో టేప్ చేసి మళ్లీ పాపకే వినిపించేది

ఆరోజు శ్రుతి వాళ్ల స్కూలులో 'చిల్డ్రన్స్ డే' సెలెబ్రేట్ చేస్తున్నారు శ్రుతి ఒక డ్రామాలో వేషం వేస్తోంది పల్లెటూరి పిల్ల వేషం రోజూ ఇంటిదగ్గిర తన పోర్షన్ ప్రాక్టీసు చేస్తోంది శ్రుతి తల్లిచేత చీర ఒకటి ఏరి వుంచుకుంది, కట్టుకోవడానికి పల్లవి తను కూడా ముందే వెళ్లింది— సహాయం చెయ్యడానికి మేకప్‌లో! చీర కట్టి, కొప్పు పెట్టి,కాళ్ళకి గజ్జెలు కట్టి, చేతుల నిండా రంగు రంగుల మట్టిగాజులు వేసింది. కళ్లకి నిండుగా కాటుక, నుదుట పెద్ద కుంకుమబొట్టు చూడడానికి ఎంతో ముచ్చటగా అచ్చం పల్లెటూరి పిల్ల లాగే వుంది శ్రుతి ఇంకొక పిల్లకి మగవేషం వేశారు పంచకట్టు, బనీను, తలపాగ, మీసం. అచ్చం పల్లెటూరి మగవాడిలాగే వుంది ఆ పిల్ల!

బద్ధకస్తురాలైన భార్యతో భర్త పాట్లు చూపిస్తారు ఆ తెలుగు గేయ కథలో — భార్యాభర్తల తగవు తమాషాగా వుంటుంది

''వస్తావంటే పిల వస్తావంటే కోనంగి మడుగుదాక వస్తావంటే ?'' — అని భర్త అంటే—

''వస్తాను మామయ్యా వస్తానురా ! కోనంగి మడుగు దాక వస్తానురా—నా వరహాల ముద్దుమూట నవ్వులాడ్తది-'' అంటుంది భార్య

భ నవ్వులాడ్తదా ?

భా . నవ్వు లాడ్తది

భ నీ వరహాల ముద్దుమూట నవ్వులాడైనూ— నా చేతనున్న చింత బరికె చిందులాడ్తదీ-

భా చిందులాడ్తదా ?

భ · చిందులాడ్తది !

భా నీ చేతనున్న చింత బరికె చిందులాడైనూ— నేను కూడొండ కుండానే కూకుంటనూ !

భ : కూకుంటవా ?

భా : కూకుంటను !

భ · నువ్వు కూడొండకుండానే కూకుంటెనూ— నేను పాలమెల్లకుండానే తొంగుంటనూ !







# ఎల్లప్పుడు చురుకుగా
# ఎల్లప్పుడు చైతన్యంగా

మీ బిడ్డ పెరుగుతున్నప్పుడు, ఆ బిడ్డ నిరంతరం అధికంగా శక్తి వినియోగించడం జరుగుతుంది.

బూస్ట్‌ను పాలల్లో కలిపితే, రుచికరమైన మాల్ట్ చాకొలెట్ పానీయం తయారౌతుంది. అది మీ బిడ్డకు కావలసిన శక్తిని సమకూరుస్తుంది. ఎందుచేతనంటే బూస్ట్, సంపూర్ణమైన మీగడ పాలు. గోధుమ. బార్లీ మాల్ట్, కోకోలతో తయారైనది.

మీ బిడ్డకు, శక్తినిచ్చే ఈ ఇంధనాన్ని ఇవ్వండి, అది మీ బిడ్డ రోజంతా, ప్రతి రోజు కూడా చురుగ్గా, చైతన్యవంతంగా ఉండేటట్లు చేస్తుంది




పొదుపు రీఫిల్ ప్యాక్ కొని రు. 1/- ఆదాచేయండి

# బూస్ట్

## చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం



## 26-12-1980 శుక్రవారం మొదలు
## 1-1-1981 గురువారం వరకు




**మేషం:—** వార ప్రథమ భాగంలోనే మీరు గావించిన మార్పులకు, వ్యాపారంలో అనుకూలత సంభవించగలదు. ముందు వెనుకలాలోచించి కార్య రంగానికి దిగాలి క్రింద పని చేసే వారిపై అజ మాయిషి అవసరం. ఉద్యోగ వృత్తులందు అను కూల వారమే. స్త్రీలకు కళారంగంలో, వ్యాపార వ్యవహార రంగాలలో నూతనంగా అవకాశాలు లభించగలవు.

**వృషభం —** ప్రయాణం చేయనున్నారు. అది శుభ కార్య సంబంధం కావచ్చు. కళారంగంలో క్రయ విక్రయాదులలో చాల మందికి ఆదాయ ముంటుంది. నూతన వ్యవహారాల అనేకం తెలిసి కోవటం, నగలు కొనటం, అప్పు లిచ్చిన వారినుండి ధనం గ్రహించటం మొదలైన వనులలో ప్రగతి గలవారం స్త్రీలకు శుభ కార్య ప్రస్తావనలు, ప్రయాణానుకూలత గలవారం.

**మిథునం —** రాశ్యాధిపతి అనుకూలత వలన కుటుంబ వ్యవహారాలు బాగుండటం, రావలసిన డబ్బు సమయానికి అందటం, నూతన విషయా లలో, — వ్యాపారంలో ముఖ్యంగా ప్రగతి కనిపిం చటం, కొందరకు కళారంగంలో, కొత్త అగ్రి మెంట్లు సమకూరటం, వారంలో లభించే ఫలం. స్త్రీలకు సర్వ రంగాలలో అనుకూలం. ముఖ్యంగా శుభ కార్యాను కూలత, ఉద్యోగంలో పెంపు చెప్పదగిన ఫలాలు.

**కర్కాటకం —** మీ ఆరోగ్యంలో ఈ వారం ప్రతికూలత ఏర్పడగలదు. విశేషించి, వయసు మీరిన వారు, మరీ జాగ్రత్త తీసికోవటం అవసరం కూడా. ఔషధ సేవ తప్పనిసరి అయ్యే వారం. కొందరకు నూతనోద్యోగ ప్రాప్తికి అనుకూలం గలదు స్త్రీలకు వృత్తి, ఉద్యోగాలలో, నూత నంగా వస్తువులు కొనటంలో, అనుకూల వారం.

**సింహం —** అధిక ఆదాయం, అనుకూలత, ఆనందం, సుఖ సంతోషాలకు నిలయమైన వారం. మీరు చేసేవ్యాపారంలో మాత్రం ఎంతో అను కూలత చెప్పదగి యున్నది కొందరకు క్రీడా రంగంలో విశేషంగా అవకాశాలుండ గలవు స్త్రీలకు వివిధ రంగాలలో మీక ప్రగతి సూచింపబడే వారం

**కన్య —** ఇంకా ఆరోగ్యం కుదుటపడే మార్గం లేదు. గ్రహచారం ఏమంత అనుకూలంగా లేదు గురు గ్రహ, శనిగ్రహాల యుతి, ఒకరకంగా అను కూలం, వేరొక రకంగా ప్రతికూలం ఉద్యోగ వృత్తులలో శ్రద్ధ అవసరం. స్త్రీలకు ఉద్యోగ స్థలకు, శ్రమ కరమైన వారం. జాగ్రత గ ఉద్యోగ ధర్మం నెరపాలి

**తుల —** గోచారరీత్యా ఏడున్నర సంవత్సరాల, వ్యయ రాశి స్థితి శని బాధ ఉంటుంది అనవసరంగా ఖర్చు కావచ్చు క్రయవిక్రయాలలో యిబ్బం దులుండ గలవు మీ యింట జరుగబోవు శుభ కార్యాలను గూర్చిన శ్రమ, వ్యయం చెప్పవలసి ఉన్నది స్త్రీలకు ఆరోగ్య భంగం, ఉద్యోగంలో శ్రమ చెప్పదగియున్నది

**వృశ్చికం —** రాశికి ఏకాదశంలో గల గ్రహాల మూలాన వ్యాపారంలో అనుకూలం అధిక లాభ దాయకమే గాక, భారీ వ్యాపారస్థులు, వేరొక రీత్యా వ్యాపార రంగంలో కూడా దిగ గలరు నూతన వస్తు సేకరణ, నూతన వ్యాపారంలో దక్షత చాల మందికి కనిపించ గలదు స్త్రీలకు నూత నంగ ధనాదాయం, వృతి లో అనుకూలత,సమ యానికి ఆదుకునే వారు కనిపించటం విశేషం.

**ధనుస్సు —** మీక అనుకూలత, అన్ని రంగాల్లో చెప్పటానికి వీల లేదు పనులకు దిగటమే గాని, అవి అనుకూలంగా నెరవేరేమార్గం కనిపించదు కొన్ని విషయాలలో వృథా శ్రమ కూడ మిగుల వచ్చు లేనిపోని విషయాలలో తల దూర్చవలసిన అవసరం కూడా కనిపిస్తుంది. స్త్రీలకు ఇంట శుభ కార్యాలను గూర్చిన సంభా షణ, వ్యాపారం చేసే వారైతే అనుకూలతగలదు.

**మకరం —** కృషిచేయండి ఆరోగ్యం బాగుం టుంది, అన్ని రంగాలలో మీకు అనుకూలత గలదు భారీ వ్యాపారం చేసే వారికి, చాయింటు వ్యాపారస్థులకు, నూతనావకాశాలుండ గలవు సమయానికి డబ్బు చేగికందే మార్గముున్నది కొందరకు క్రీడారంగంలో అవకాశాలు లభించ గలవు స్త్రీలకు అధిక శ్రమ, ఏ విధంగా చూచినా డబ్బు అందే మార్గం కనిపించదు

**కుంభం —** వ్యాపారం చేసే మీకు ఆటంకాలు, ముందు జరిపిన కార్యక్రమంలో ప్రతికూలత ఏర్పడగల వారం అధిక రుణ వలన వ్యాపారరంగ ములో బెడద కనిపించ గలదు. ? ంతంగా సామ రస్యంగా, వ్యాపార, వ్యవహార పరిష్కారాలలో నెరవేర్చుకొనుట మీ కనీస ధర్మం స్త్రీలకు. సర్వ విషయాలలో ఆటంకాలుంటాయి

**మీనం —** సాధారణ వ్యవహారాలలో మీకు ఏ విధంగా లోపం కనిపించదు కాని, ధనాదాయం మాత్రం కనిపించదు శ్రమ మాత్రమే మిగిలి పోతుంది— అని మాత్రం చప్పవచ్చు క్రయ విక్రయాలలో అధిక శ్రమ కూడా కనిపిస్తుంది కొందరకు చిత్ర రంగంలో నూతనావకాశాలుండ గలవు స్త్రీలకు వసు వాహనాలు, సంపాదనకు, అధిక విద్యా సంపాదనకు, వృత్తిలో లాభం గడిం చుటకు అనుకూల వారమే

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

## రాగలహరి

భా : తొంగుంటవా ?

భ : తొంగుంటను !

భా : నువ్వు పాలమెల్లకుండానే తొంగుం టెనూ— నేను అమ్మగారింటికి దొడేస్తనూ!

భ : దొడేస్తవా ?

భా : దొడేస్తనూ !

భ :నువ్వు అమ్మగారింటికి దొడేస్తెనూ— నేను కొట్టుకుంట – తిట్టుకుంట లాక్కొస్తనూ— నిన్ను కొట్టుకొంట తిట్టుకొంట లాక్కొస్తనూ—''

శృతీ, ఆ పిల్లా పోటీలుపడి నటించారు. అందరూ చాలా ఆనందించారు. మెచ్చు కున్నారు! ఫోటోలు ఎన్నో తీశారు! శృతి చాలా చక్కగా వుంది

విప్పట్నాగానే చరణ్ రాలేదు.

చాలా రోజుల తరువాత నిరుత్సాహంతో బాటు కోపం గూడా వచ్చింది పల్లవికి

ఇంతమంది చూసి శృతిని పొగుడుతూ— మెచ్చుకుంటూ వుంటే కన్నతండ్రి రాలేదు. అతడికేమీ పట్టదు. అక్కర్లేదు. చెప్పినా, ఈ సంగతి కళ్ళకి కట్టినట్లు వర్ణించినా — "ఆహాఁ అట్లాగా" అని ఊరుకుంటాడు. ఎన్నిసార్లు చెప్పినా తన ధోరణి తనదేగానీ, మారనే మారడు గదా! ఇంకితడు ఇంతేనా ?

పరధ్యానంతో ఇల్లు చేరింది శృతితో పల్లవి మధ్యాన్నం నించీ అక్కడ విశ్రాంతి లేకపోవడం వల్లనో ఏమో కాళ్ళు చాలా నొప్పులుగా వున్నాయి. బాగా అలసటగా వుంది

అప్పుడంత తెలీలేదు కారుదిగి లోపలికి నడవలేకపోయింది ఆ ఉత్సాహంలో ఏమీ తెలీలేదు బాగా బడలిక చేసింది కాళ్ళు ఈడ్చుకుంటూ లోపలికెళ్ళి సోఫాలో వాలి పోయింది తలనొప్పి కూడా మొదలయింది. కళ్ళు బరువుగా వున్నాయి.

(ఇంకా వుంది)

ఆనందానికి
చీకూ-చింతా లేని వివాహ జీవితానికి
నిరోధ్ వాడండి




సరయిన గర్భనిరోధక సాధనం



davp 80/38



# సమాజంకోసం

'పెద్దన్న'

కోర్టుహాలులోనికి అడుగు పెడుతున్న పబ్లిక్ ప్రాసిక్యూటర్ అరుణాదేవి తల ఎత్తి బోనులో నిలబడియున్న వ్యక్తిని చూచి ఉలిక్కిపడింది శుష్కించి పోయిన దేహం, గుంటలు పడిన ఆ కళ్ళు, మాసిన గడ్డంతో ఉన్న ఆ వ్యక్తిని చూస్తున్న అరుణాదేవి మనస్సు గతాన్ని తడుముతూ గుండెల్లో అణగారి పోయిన గాయాన్ని రగుల్కొలుపుతూ ఉంది. ఆ వ్యక్తి రాజశేఖరు కాదుకదా! సందేహంలేదు. అతను రాజశేఖరమే అనడానికి నిదర్శనం, ఆ కళ్ళల్లో ఉన్న పట్టుదల, ఎదుటి వ్యక్తిని సూటిగా ఒక్కచూపులోనే చదివేయగల తీక్షణమైన అతని కళ్ళు తనకి బాగా గుర్తు ఇతను ఇక్కడ ఈ పరిస్థితిలో...

ఒక్కసారిగా వర్తమానంలోనికి వచ్చిన అరుణాదేవి ఉలిక్కిపడింది ఏమిటిది? ఇప్పుడు తాను వాదించబోయె కేసులో ముద్దాయికాదు కదా! కేసు తాలూకు వివరాలు గుర్తు వచ్చి మనస్సు మొద్దుబారిపోయింది శరీరంభయాందోళనలతో కంపించింది. తనలోని రక్తమంతా గడ్డకట్టినట్లుగా, శరీరం చల్లబడిపోయింది. హృదయం బాధతో వేగిపోతున్నది. లాభంలేదు. ఈ కేసు తాను లీడ్ చేయలేదు.

ఆ కేసును విత్‌డ్రా చేసుకొని, తోటి పబ్లిక్ ప్రాసిక్యూటర్‌కి అప్పచెప్పి, కోర్టు హాలునుండి బయట పడింది.

కారులో ఇంటి దారి పట్టిన అరుణాదేవి గతం తాలూకు ఛాయలు వీడక ఆమె అంతరంగాన్ని అల్లకల్లోలం చేస్తున్నాయి. అతను తనను గుర్తించాడా? అతడి చూపులు ఇక్కడ లేవు. ఎక్కడో భవిష్యత్తులో ఒక నవ్య వ్యవస్థను అవలోకిస్తున్నట్లుగా ఉన్నాయి. అతను తనని గమనించినట్లేలేదు.

తనకి బాగా గుర్తు ఆ రోజు కాలేజి డిబేటింగ్‌కి తాను కూడ హాజరైనది. ఫైనలియరు స్టూడెంటు రాజశేఖరం "రాజకీయ రంగములో విద్యార్థుల పాత్ర" గురించిఎంతో ఉద్రేకంగా, ఆవేశంగా చెపుతుంటే అవాక్కయిపోయి వింటూ బొమ్మలా నిల్చుండిపోయింది. అతని ఆదర్శాల గురించి, దేశంలో సమానత్వానికై అతడు పడే ఆరాటం గురించి తాను చాల సార్లు తన స్నేహితుల ద్వారా విన్నది. ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తుంటే విద్యార్థి దశలోనే రాజకీయాలలో బాగా అనుభవం గడించిన వ్యక్తిలాకనిపిస్తున్నాడు అతని విప్లవాత్మకమైన భావాలు, ఆశయాలు గురించి బాగా తాను విన్నది నిలువెత్తు విగ్రహం, ఎర్రబడిన మొహం, ఉద్రేకంతో అతను పలికే ఒక్కొక్క మాటకు విద్యార్థులంతా కరతాళధ్వనులు చేస్తున్నారు అతని స్వరములో ఆవేశమేకాక, ఆవేదన కూడా ఉంది. అతని ధోరణి చూస్తుంటె దేశం కోసం ఏదైనా చేయుగల త్యాగమూర్తిలా కనుపించాడు. "దేశం కోసం, దేశ భవిష్యత్తు కోసం విద్యార్థులు రాజకీయ రంగంలో ప్రవేశించాలని, ప్రజలకు కనీస అవసరాలు తీర్చలేని ప్రభుత్వాన్ని విద్యార్థులే పడగొట్టాలని, అన్ని రంగాలలో ముఖ్యంగా విద్యా

మిగిలిన తెల్లదనాలని మైమరపించే స్వచ్ఛమయిన
తెల్లదనం యిచ్చే స్కోర్—నీలం డిటర్జెంట్ బిళ్ల.
ప్రకాశవంతమయిన తెలుపు. తెల్లని తెలుపు.
పోటిలేని తెలుపు! స్కోర్ నీలం డిటర్జెంట్ బిళ్ల
మీ దుస్తుల మురికిని పోగొట్టి వాటికి
పరిశుభ్రమయిన తెలుపుని యిస్తుంది.
స్కోర్ నీలం డిటర్జెంట్ బిళ్లతో ఎన్నో బట్టలు
ఉతకవచ్చు. ఎంతో తెల్లగా. రంగు దుస్తులకి
కూడా మెరుపుతనం తెస్తుంది.

# విజయ సాధనలో తళ తళ మెరిసే తెలుపు!

# స్కోర్

## నీలం డిటర్జెంట్ బిళ్ల

కేరళ స్టేట్ డిటర్జెంట్స్ & కెమికల్స్ లిడ్.)
(ఒక ప్రభుత్వ సంస్థ)




విజయ సాధనలో
తళ తళ మెరిసే తెలుపు!

FDS KSDC 3022A TEL

రంగములో ఉన్న అవినీతిని విద్యార్థులే తొలగించాలని, ఇందుకు తగిన చైతన్యం విద్యార్థులు అలవరచుకోవాలని, నవ్య వ్యవస్థను స్థాపించే బాధ్యత ఈ నాటి యువకులదేనని'' అతను బల్లగుద్ది వాదిస్తుంటే విద్యార్థులలో ఆవేశం పెల్లుబికి హర్షధ్యానాలతో అతని చుట్టుముట్టి వేసారు. వీలైనప్పుడల్లా విద్యార్థులను సమీకరించి అతను భోదించే విప్లవాత్మక విషయాలు లెక్చరర్లకు కూడా చర్చనీయాంశములుగా తయారైనాయి. ఎప్పటికైనా అతను గొప్ప విప్లవకారుడుగా తయారవుతాడని లెక్చరర్లు, సాటి విద్యార్థులు జోస్యం చెప్పేవారు.

ఆ రోజు కారులో తాను కాలేజీకి వస్తుంటే ఎదురుగా తలవంచుకునస్తున్న రాజశేఖరాన్ని చూచి సడన్ బ్రేకుతో కారాపి విష్ చేసింది!

''హలో **గుడ్** మార్నింగ్ రాజశేఖరం గారూ!''

''గుడ్ మార్నింగ్!''

ప్రశ్నార్థకంగా అతని చూపులకు తనను తాను పరిచయం చేసుకుంది.

''నా పేరు అరుణ. కాంట్రాక్టరు వెంకట్రావుగారి అమ్మాయిని.''

''ఐ. సి.'' అతని పెదవులపై చిరునవ్వు.

''రండి. డ్రాప్ చేస్తాను.''

''నో, థాంక్స్. నడిచి వెళ్ళగలను ''

ఒక్క క్షణం చివుక్కుమంది మనసు. అంతలోనే సర్దుకొని డోర్ తెరిచి ''ప్లీజ్'' అంది. ''ఆల్ రైట్'' అంటూ కారెక్కి తలుపు మూసాడు.

# సమాజం కోసం

తన ప్రక్కగా కూర్చున్న అతని దుస్తులకు, తన దుస్తులకు గల తేడా మనసును కలచివేసింది. రాజశేఖరం ఆర్థికమైన ఇబ్బందులమధ్య పెరిగాడని, చదువు కూడా అతి కష్టంమీద కొనసాగిస్తున్నాడని తాను విన్నదే కాని, ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తుంటే అతని పరిస్థితి అర్థమవుతున్నది. ముభావంగా కూర్చున్న అతనితో సంభాషణ కలపాలని—

''మా నాన్నగారు మీలాటి అభ్యుదయ భావాలు కల యువకులంటే చాలా లైక్ చేస్తారు'' అన్న తన మాటకి అతనికళ్ళల్లో లిప్తకాలం కనిపించిన నిరసన భావం తన కంట పడకుండా పోలేదు. ఏమిటిది?డబ్బుగలవారంటే ఇతనికి ఏహ్యభావమా? అనుకున్నది. కారు కాలేజి గేటు దాటి ఆవరణలోనికి ప్రవేశించినది. కారు దిగి ''థాంక్స్'' చెప్పి గంభీరంగా వెళ్తున్న అతని 'మూర్తి'తన హృదయంలో చెరగని ముద్ర వేసింది.

వీలైనప్పుడల్లా అతని డిబేటింగ్స్ ఉంటే వెళ్ళేది. రెండు, మూడుసార్లు పలకరించబోయినా ముక్తసరిగా జవాబులు చెప్పి వెళ్ళేవాడు. ఏ అమ్మాయిల వంక కన్నెత్తి చూడటముకాని, అనవసర సంభాషణలకు కాని వీలు కల్పించేవాడు కాడు. అతని కళ్ళల్లో బలీయమైన ఆశయాలు కదలాడు తుండేవి. తన ఆశయ సిద్ధిని నెరవేర్చుకొనే అవకాశం కోసం ఎదురుచూస్తున్నట్లు ఉండేది అతని ధోరణి. ఎందుకో ప్రతిక్షణం అతను గుర్తుకు వచ్చేవాడు. అతనిపట్ల ఒకవిధమైన గౌరవభావం, ఇంకేదో తెలియని భావము తనలో కొట్టుమిట్టాడుతున్న సమయంలో,రాజశేఖరం చదువుకు ''గుడ్ బై'' చెప్పి తీవ్రవాదుల ఉద్యమంలో చేరినట్లుగా వార్త కాలేజీలో వ్యాపించింది. రాజశేఖరం ప్రవర్తన బట్టి ఇటువంటిదేదో ముందుగానే ఊహించినా, అతను ఆ విధంగా చేయటం ఒక విధమైన కలవరపాటునే కలిగించింది. అతని ఆశయసిద్ధికై ఎన్నుకున్న బాట సరైనది కాదేమో!క్రమంగా అతని జ్ఞాపకాలు మరుగున పడ్డాయి.

గతాన్ని నెమరువేసుకుంటున్న అరుణ సడన్ బ్రేక్‌తో కారాపి వాస్తవంలోనికి వచ్చి, ఎదుటి దృశ్యాన్ని చూచిన అరుణ మనస్సు విలవిలలాడింది రోడ్డుప్రక్కగా'డష్ట్ బిన్'లో పారవేసిన ఎంగిలి మెతుకుల కోసం పోటీ పడుకుంటున్న ముగ్గురు పిల్లలు, మాకూ వాటా కావాలని కలబడుతున్న రెండు కుక్కలు కనిపించాయి. కనీసం పిల్లల వంటిమీద పాత గోచి అయినా లేదు. ఆ దృశ్యాన్ని చూసున్న అరుణ మనస్సు వికలమైపోయింది. దేశంలో ఎందరో దౌర్భాగ్యులు ఇంటటి దయనీయ స్థితిలో దిక్కు లేక ఆకలిలో అలమటిస్తుంటే, తన దేశంలో తనతోటి మనుష్యుల కోసం ఏదోచేయాలనే వెర్రి ఆవేశంతో ప్రాణాలను, తమ భవిష్యత్తునుసహితం లెక్కచేయక దేశం కోసం ఉద్యమించే రాజశేఖరం లాటి వ్యక్తులు కళ్ళముందు కదలాడారు

ఎందరో రాజశేఖరంలు దేశం కోసం తమ భవిష్యత్తును బలి పెడుతూనే ఉన్నారు.దౌర్జన్యంగా అయినా వ్యవస్థను మార్చాలన్న రాజశేఖరంలాటి వ్యక్తుల అభిప్రాయం 'తప్పు'అని, అవి సంఘ విద్రోహక చర్యలుగా, చట్టాన్ని ఎదిరించటము అని న్యాయ స్థానాలు తీర్పు ఇస్తే, ఇక విప్లవం ఏ రూపంగా వస్తుందో! ఎటునుండి వస్తుందో అంతుపట్టక దేశవాసులందరూ ఎవరికివారే చేతులు ముడుచుకు కూర్చుంటే, ఎంగిలాకులకై కొట్టుకునే ఇటువంటినిస్సహాయులజీవితాలు బాగుపడేదెప్పుడు? దేశం సమానత్వాన్ని సాధించేదెప్పుడు? అనే ప్రశ్నలు అరుణ అంతరంగములో ఉవ్వెత్తున లేస్తున్నాయి. ఎంగిలి మెతుకులు అపురూపముగా తింటున్న పిల్లలపై దృష్టిని నిగిడ్చి శూన్యమైన చూపులతో, భారమైన హృదయంతో స్టీరింగుపై తలవాల్చి కూర్చుండిపోయింది అరుణ.



తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కొంగ్రొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దిన పత్రిక పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీ ఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు, గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్‌బాగ్, హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.




(గత సంచిక తరువాయి)

## 19

శైలవలకి ఇంటికి వచ్చినప్పుడల్లా, రామం, లిల్లీని చూస్తున్న సంగతి చంపాకి తెలుసు !

కాశీపతికీ తెలుసు !

ఈ ఊరు పట్నమే అయినా, మహాపట్నం కాదు కాబట్టే, వార్తలు వ్యాపించడానికి అట్టే సమయం పట్టదు —

అందరికీ తెలిసినప్పుడు అమ్మకీ తెలిసింది ! రామాన్ని నిలదీసి అడిగిందామె — "ఏరా రామం ? ఆ క్రిస్టియన్ల పిల్లతో నీకేం పనిరా ? నువ్వు వాళ్ల ఇంటికి వెళ్లడం అదీ నాకేం నచ్చలేదు !"

ఇంత నిక్కచ్చిగా దాడి జరగ్గానే రామం నిరుత్తరుడయ్యేడు — మరెవ్వరా ప్రశ్న వేసినా తిరగ బడును కాని, అమ్మ అడగ్గానే తగ్గేడు —

"వెళ్తే తప్పేముందమ్మా? లిల్లీ చిన్నప్పట్నించి మనందరికీ తెలుసు. . ఆ పరిచయంవల్ల మాట్లాడు తుంది — వాళ్లమ్మగారు నన్ను టీకి వారింటికి పిలుస్తే వెళ్లనని ఎలా చెప్పడం ?"

"ఓసారి వెళ్లేవ్ బాగుంది .. రెండుసార్లు వెళ్లేవ్ బాగుంది — కాని నిత్యం నాళ్లింటే మకాం పెట్టేడం నాకేం నచ్చలేదు ! మన అంతరం ఏమిటి వాళ్ల అంతరం ఏమిటి ? మన కులం, మన మతం వేరు ! వారితో మనం అంత పులుసుక తిరగడం మంచిది కాదు !"

రామం జవాబివ్వలేదు—జవాబిచ్చి ఏం లాభం ? ఈ దేశంలో పుట్టిన ప్రతివాడూ కులంలోకి పుడతాడు. మతంలోకి పుడతాడు — దరిద్రంలోకి కాని, డబ్బులోకి కాని పుడతాడు - దరిద్రుడు ధనవంతుడు అవొచ్చు.. ధనవంతుడు దరిద్రుడు కావచ్చు . కాని కులం మాత్రం పోదు — రాజకీయాలు కులపరంగా, మతపరంగా మనుష్యుల్ని విడదీసి, ఆ భేదాలని ఎక్కువ చేసుకుంటూ వెళ్తున్నాయి — నాయకులు వోట్ల కోసం, వోట్లు వచ్చి ఎన్నికయ్యాక పదవి నిలబెట్టుకోడం కోసం కులవ్యవస్థని నీరుపోసి పెంచుతున్నారు — ఇదంతా హిపాక్రసీ అని రామం భావన

"సరేలే అమ్మా ! వెళ్లన్లే !" అన్నాడు... ఎందుకు అమ్మతో అనొసరంగా వాదన అని - కాని వెళ్లడం మానలేదు —

* * *

రామం వచ్చేసరికి లిల్లీ అమ్మ శాంతమ్మ ఎంతో ఆప్యాయంగా ఆహ్వానిస్తుంది, ముఖానికి చిరునవ్వు తగుల్చుకొని. శాంతమ్మకి ఎంతో సొంపుగా నవ్వడం వచ్చు. లిల్లీ అంతకన్న సమ్మోహనంగా చిరునవ్వు నవ్వుతుంది నవ్వినప్పుడు బుగ్గలు సొట్టలు పోతాయి

"రా బాబూ రామం ! ఎప్పుడొచ్చేవ్ వైజాగ్ నుంచి ?" అంటూ ఆహ్వానించి, బిస్కట్లూ, టీ ఇచ్చి ఎన్నో సంగతులడుగుతుంది.

లిల్లీ కూడా అక్కడే కూర్చొని కబుర్లాడు తుంది.

కొంతసేపయ్యేక ఏదో సాకు చెప్పి శాంతమ్మ తప్పుకుంటుంది అప్పుడు లిల్లీ, రామం కూర్చొని ఎన్నో సంగతులు చెప్పుకుంటారు

వయసులోని మగాడు, పరువంలోని ఆడదీ ఒకచోట కూర్చొని మాటలు ప్రారంభించగానే సంగతులకేం కొదవ ? ఎంత ప్రాముఖ్యత లేని విషయం అన్నా వాళ్లకి ప్రాముఖ్యం ఉన్నదానిలానే కనిపిస్తుంది నారిద్దరికీ కావల్సిందల్లా ఒకరి కళ్లలోకొకరు చూస్తూ, ఒకరి గొంతొకరు వినడం

ఒకరంటే ఒకరికి ప్రేమభావం ఉందని వారి మనసులకి అర్థమయింది — పైకి మాత్రం అనుకోలేదు స్పష్టంగా —

**జరిగిన కథ-7 :** చంప నాన్న కాశీపతి చాలీ చాలని జీతంతో ఆ ఇంటిని అలానే నెట్టుకొస్తున్నాడు మధ్య తరగతి కుటుంబంలోఉండే చికాకులు, సమస్యలు ఆ ఇంట్లోనూ వున్నాయి. చంప నాన్నమ్మకి వోపిక ఉన్నంత కాలమూ చాకిరీ చేయించుకొన్న కొడుకులూ, కూతుళ్ళూ ఆమెకు వోపిక తగ్గడంతో ఆమెను పోషించటానికి వంతులుపడ్డారు. చంప మామ అవధానివల్ల నాన్నకి ఏర్పడ్డ చిలుముగొట్టం అలవాటుతో అమ్మా, నాన్నల మధ్య వాదోపవాదాలు చెలరేగేవి. చంప అన్న రామంని కాలేజీలో చేర్చడానికి అమ్మ గాజులు అమ్మక తప్పలేదు ఖర్చులు పెరగడంతో నాన్న సిగిరెట్లు మానివేయగా చంప బాధ పడుతుంది. గతంలో తన కంపాస్ బాక్స్ దొంగిలించిన అప్పారావ్‌ని తన పుట్టినరోజు అని చెప్పి తన ఇంటికి నాన్న చెప్పగా ఆహ్వానిస్తుంది చంప. అతను వెళ్ళింతర్వాత అలా దొంగింలిచడం అతని తప్పు కాదని ఆ విషయంమీద ఓ లెక్చర్ ఇచ్చాడు నాన్న. గీతత్త అంటే రామానికి ఓ ప్రత్యేకమైన అభిమానం. ఆమెకు అన్నీ వున్నా పిల్లలులేరు. నాన్న చెయ్యి చూసి నీకు ఇద్దరు పిల్లలున్నారని చెప్పగా, ఆమె ముఖం వికసించేది. శ్రీనుమీద ప్రేమ కురిపించే చిన్నాన్న పార్వతీపురంలో ఉన్న ఇల్లు అమ్మేసి తన భాగం డబ్బు తనకు పంపమని ఉత్తరం వ్రాస్తాడు నాన్నకు. అమ్మ ఆలోచించి ఆ ఇల్లుఅమ్మటానికే నిశ్చయించుకొంటుంది నాన్నతో సంప్రదించినమీదట. అనుకోకుండా అనేకమైన ఖర్చులు నెత్తినపడడంతో ఇల్లుఅమ్మగా వచ్చిన తనవాటా మొత్తం ఖర్చయిపోతుంది. ఈలోగ చంపాపెద్దమనిషయికూర్చుంటుంది రామంని వైజాగ్ ఇంజనీరింగ్ కాలేజీలో చేర్పిస్తాడు నాన్న, బంధువుల స్నేహితుల సలహా ప్రకారం. చంపా కాలేజీలో చేరుతుంది. తాము చేసుకున్న పెళ్లి ఒప్పందం ప్రకారం లాయర్ ప్రకాశరావు శ్రీనుని మెడికల్ కాలేజీలో చేరేట్లు చేస్తాడు

కాని సంభాషణా క్రమంలో ఆ భావం ధ్వనించే మాటలు దొర్లేవి

"చదువయిపోయేక ఏం చేస్తావు రామం ?" అని లిల్లీ అడిగేది.

"ఉద్యోగం చేస్తాను .. మరేం చేస్తాను ?" లిల్లీకి జవాబిచ్చేవాడు.

"పెళ్లి చేసుకోవా ?" చిరునవ్వుతో లిల్లీ ... కొంటెగా.

"పెళ్లా ? ఔను ! అది మరి తప్పుతుందా?"

"అమ్మా, నాన్న చూసిన సంబంధం బుద్ధిగా చేసుకుంటావా ?"

"చేసుకోమన్నావా ?" రామం తిరిగి అడగ్గా—

"నేనెవర్తెని మధ్యని ?" లిల్లీ బుంగ మూతి పెట్టి...

"ఏం ? నువ్వెవరూ కావా ?"

"నా మాటకే విలువనిస్తే నీకీ సందేహమే ఉండదు !"

"సరే ! అప్పటి మాట ! ఇప్పుడెందుకు వర్రీ ? చదువు పూర్తి కావాలి ..జాబ్ దొరకాలి . అప్పుడూ పెళ్లి మాట !"

"నీ పెళ్లికి నన్ను పిలుస్తావా ?"

"పిలవడమెక్కడేనా ? పెళ్లి పీటలమీద కూర్చోమంటాను !"

"పెళ్లికూతురుకి తోడుగాన ?"

"పెళ్లికూతురుకి మారుగా !"

"నన్నే పెళ్లికూతురనుకొని పుస్తె కట్టేసేవు కొంపతీసి !"

"పుస్తెల తాళ్లు నీకవుసరం లేదుగా ? రిజిస్టర్‌లో సంతకం పెట్టమంటావ్ !"

"పెడతావా సంతకం ?"

"పెట్టకేం జేస్తాను ?"

"మీ అమ్మ కొంగు వదలగలవా ?"

"భయమెందుకు ? నీ కొంగు ఉందిగా ?"

ఇద్దరూ నవ్వుకుంటారు

ఏవో స్వీట్ నథింగ్స్ మాట్లాడుకుంటూ కాలం సెకెండ్లలా గడిచిపోతుంది .. ఆమె సాన్నిధ్యంలో ఒక మధుర భావన ... ఆమెని వదిలి పోవాలంటే గుండెల బరువు ... ఆమెని మర్నాడు చూడగల నన్న ఆశ ఒక హాయి .. విశాఖ వెళ్లి పోయాక ఆమె స్మృతులు ఒక టానిక్ .

## 20

చంపాకుమారి కాలేజిలో చేరింది. ఇంట్లో కూర్చొని ఏం చేస్తుంది ? పెళ్లి ఇంత వేగం అయ్యే అవకాశం ఎలాగూ లేదు. కాలాన్ని వృథా చేసేకన్న కాలేజిలో చేర్చడం ఉత్తమం. ప్లీడరు ప్రకాశరావు శ్రీను పెళ్లిఖాయం చేసుకున్నప్పు డిచ్చిన కట్నం ఎడ్వాన్సు ఏనుగంత బలం ఇచ్చింది నాన్నకి. అందులోంచే కాలేజి ఫీజు, చంపాకి బట్టలు

* * *

ఈ విధంగా దిగువ మధ్యతరగతి సంసారి కాశీపతి జీవితం యవ్వనం, మధ్య వయస్సూ వదిలి రిటైరయ్యే దగ్గరి కాలం చేరుకుంది. మరో నాలుగేళ్లకో, ఐదేళ్లకో సర్వీసు సరి — అప్పటికి రామం ఎలానూ అందుకొస్తాడు ! వాడిమీద కొంత



బరువు వెయ్యొచ్చు ! ఈ మధ్య చంపకి ఏదో ఒక మంచి సంబంధం చూసి పెళ్ళిచేసేస్తే తన బరువు బాధ్యతలు తీరిపోతాయి !

అతడి పిల్లల జీవితం బాల్యం, కౌమార్యం వదిలి యవ్వనంలో అడుగు పెట్టింది వారి వారి ఆదర్శాలూ, ఆశయాలూ, ఊహలూ కూడా మారేయి

అన్నలిద్దరూ చదువులకి విశాఖలో ఉండడం వల్ల, చంప ఒంటరిదయింది ఇంట్లో కావల్సినంత స్వేచ్ఛ దొరికినా, మాట్లాడ్డానికీ, కొట్లాడ్డానికీ ఇంట్లో ఎవరూ లేకపోవడం వల్ల ఎంతో వెలితిగా ఉంటోంది. ఈ వెలితికి నష్టపరిహారంలా అమ్మా, నాన్నల అనురాగ దృష్టి ఆమెమీద కేంద్రీకృతం అయింది ఇదివరకు ఏం తిన్నదో, ఎక్కడ ఉన్నదో పట్టించుకోనివారు ఇప్పుడు ప్రతి సంగతీ పట్టించు కుంటున్నారు.

"చంపా ! అదేమిటే. పిట్టతిండి మరీనీ ? సరిగా తిను !" అంటూ దగ్గర కూర్చొని అమ్మ తినిపిస్తోంది.

కాలేజినించి రావడం ఆలస్యం అవగానే అమ్మ ఆత్రత కనపరుస్తుంది. "అలా ఓ అడుగువేసి చూసి రండి, ఎందు కాలస్యమయిందో ? రౌడీ వెధవలు ఎక్కువయిపోయేరు మరీనీ ! ఆడపిల్ల కనిపిస్తే కోతిమూకలా వెంటపడతారు !"

"ఏమయిపోతుంది ? దాని స్నేహితురాళ్ళతో కబుర్లలోపడి ఉంటుంది ! ఆడపిల్లల వెంటపడే కోతిమూకలుండొచ్చు కాని, అదలించగానే చెదిరి పోతారు ! మన ఊరింకా రౌడీ ఊరుగా తయారవ లేదు !" అంటూ సిగరెట్టు ముట్టించి నాన్న ఇంట్లో కూచుంటారు

ఇంతలో చంప వస్తే "ఏమే ఇంత ఆలస్యమయింది ?" అని అమ్మ

"ఇవాళ ఒక ఎక్స్ట్రా క్లాస్ పెట్టేరమ్మా సైకాలజీ !"

"ఆలస్యమయితే బెంగ !"

"బెంగెందుకమ్మా ? ఏమయిపోతాను ?"

"ఏమోనమ్మా ! రౌడీమూక ఊరునిండా !"

"నే ఒక్కర్తినీ కానుకదమ్మా ఆడపిల్లని ? వందలకొద్దీ ఉన్నారు ! వాళ్ళని అల్లరిపెట్టంది, నన్నేనా అల్లరిపెడతారు ?"

నాన్న వీధిలోంచి కేక. "సర్లే అమ్మలూ ! పిల్లని హడలుకొట్టించకు — అంతగా ఒస్తే వారిలోనే ఉన్నాడు అప్పారావు — ఓ కేక వేస్తే వచ్చి చితకతంతాడు ! ఎంత రౌడీలన్నా వాడిముందు బలాదూర్ !"

"వాడంటే మీ కెందుకంత అపేక్ష పుట్టు కొచ్చిందీ ? వాడేం తక్కువ తిన్నాడా ?"

"తక్కువేం తినలేదనే అంటున్నాను. చదువు మానేసి తండ్రి దగ్గర మోటార్ మెకానిజమ్ పనులన్నీ నేర్చుకున్నాడు ! ఇప్పుడు తనే ఒక దుకాణం పెట్టేడు ! కారులూ, లారీలూ, మోటార్ సైకిళ్ళ మరామత్తు ప్రారంభించేడు ! చూస్తూ ఉండు ! వాడే పెద్దవాడౌతాడు !"

"సర్లెండి ! వాడేమయితే మనకేం ? మేనత్త కొడుకా, మేనమామ కొడుకా ? మనకేం పెట్టిపోతలు చెయ్యాలా ? వాడెవడో... మనమెవరో !"

"ఎవ్వరూ ఎవరికీ పెట్టిపోతలు పొయ్యారే అమ్మలూ ! ఎవరికివారే యమునాతీరే ! కన్నకొడుకులే కాకుండాపోతున్నారు... ! దూరంవాళ్ళే అభిమానం చూపిస్తారు."

"నా పిల్లలెప్పుడూ నాకు దూరమవరు !"

"చంపాకి పెళ్ళి చేసి అత్తవారింటికి పంపుతే మనకి దూరం కాదా ? దాన్ని పెళ్ళాడిన ఎవడో దూరపువాడు దగ్గరవడా ?"

"అదా మీరన్నది ! సరిపోయింది మీ వరస ! చూడండయితే సంబంధం ! దీని పెళ్ళి ముందు జరిపేస్తే పోయె !" అమ్మ...

"ఏం పెట్టి పెళ్ళి జరిపిస్తాం చెప్పు ? చదువులకని ఉన్నదంతా పెట్టేసేం — ప్రావిడెంట్ ఫండ్ లోన్లయ్యేయి .. ఈ కొంప మిగిలింది... ఇదీ అమ్మేస్తే మనం వీధిన పడాలి !"

"కొడుకుల్ని చదివిస్తున్నారేమో... ! వాళ్ళు రేప్పొద్దున్న పెద్ద ఉద్యోగాలు చేసి మిమ్మల్ని

అందలం ఎక్కిస్తారేమో ? వాళ్ళే చంపకి పెళ్ళి చేస్తారు !''

''నీ నోరు చల్లగా అలానే కావాలి !''

ఈ నాన్నా అమ్మా కబుర్లు వినడం చంపాకి ఎరాకు ! వీళ్ళిద్దరికీ మరేం పనీపాటూ లేదు — కొడుకుల చదువులూ, ఉద్యోగాలూ, తన పెళ్ళి గొడవా తప్పించి, ప్రపంచంలో తక్కిన సమస్యలే ఉన్నట్టు తోచదు, వీళ్ళకి ! కొడుకులయితే ఉద్యోగాల గురించి చింత.. కూతుళ్ళయితే పెళ్ళిళ్ల గురించి చింత — అడివి మనుష్యులు నయం ! ఈ నాగరికతా ప్రపంచపు గజిబిజి లేకుండా హాయిగా బతికేస్తూంటారు ! వాళ్ళకి చదువులూ, ఉద్యోగాలూ, ఆడపిల్ల పెళ్ళి సమస్యలూ ఉండవని వింది ! మగాళ్ళ భూమి దున్నుతారు — కర్రలు కొట్టి అమ్ముతారు - ఇష్టమున్న ఆడదాన్ని మగాడు చేపడతాడు--సంసారం చేస్తాడు వాళ్ళమధ్య నవీన నాగరికతని ప్రవేశపెడదామని ప్రయత్నించి ప్రభుత్వం వారికున్న తృప్తిని కాస్త హరిద్దామని చూస్తోంది. ఈ నవీన నాగరికత తాగుడు నిషా వంటిది .. దీని పరిధిలో ఉన్నవాళ్లకి ఆ నిషా అలవాటయి, అది లేకపోతే బతుక్కి అర్థం కనిపించదు ! నవీన నాగరికతకి డబ్బు మూలస్థంబం. హోదా పునాది... అంతస్థులు, ఫేషన్లు, వర్గాలు ... వర్ణాలు ... ఎక్కువ తక్కువలూ...ఇవన్నీ నాగరికతా ప్రభావం! మనిషిగా పుట్టడమే పాపమేమో ? ... ఇలా ఆలోచించేది చంపా.

''ఎందుకమ్మా నా పెళ్ళి గురించి బెంగ ?

# స్పందన

ముందు అన్నలకి పెళ్ళవనీ .. నేను బ్రహ్మకుమారిగానే ఉండిపోతాను !'' చంప కలిగించుకుంది.

''బాగుంది వరస ! ఈ కాలం ఆడపిల్లలకి ఇదొకటవడం చేతనౌను ! మీ తాత ఎనమండుగురు కూతుళ్లకి పెళ్ళిళ్ళు చేసేరు ఒక్క ఏగాణీ కన్యాశుల్కం పుచ్చుకోలేదు !''

''మగాడు తిరిగి కట్నం ఇచ్చుకొనేవాడా అమ్మా ?'' చంప ఆశ్చర్యం !

''ఆ రోజులే వేరు చంపా ! ఆడపిల్ల పుడితే లక్ష్మి పుట్టినట్టే ! ఎందరాడపిల్లలుంటే అంత భాగ్యం — మగపిల్లడి తరఫువారు కట్నంపోసి ఆడపిల్లని తెచ్చుకొనేవారు కోడలిగా !''

అప్పుడు నాన్న కల్పించుకునేవారు — ''దాన్నే లా ఆఫ్ డిమాండ్ ఎండ్ సప్లయి అంటారు ! ఆనాడు ఓ మగాడు ఇద్దరు, ముగ్గురు ఆడపిల్లల్ని పెళ్ళాడేవాడు ! చావడానికి సిద్ధంగా ఉన్నవాడు కూడా, పెళ్ళాం పోగానే మరో ఆడదానికి పుస్తె కట్టేవాడు. మా ఊరి రైల్వేస్టేషన్ మాష్టారికి ఏడుగురు భార్యలుండేవారు ! అతడి జీతం వాళ్ల తలకి నూనెకి చాలేదికాదు ! ఆడది దొరకడం కష్టమయ్యేది ! అంత డిమాండు !''

''అంటే ఆ మగాడు చస్తే, ఆ ఏడుగురు భార్యల బతుకూ గంగ పాలేనా ?'' చంప అడిగింది.

''అవి ఆనాటి ముచ్చట్లు ! ఇప్పుడు దానికి రివర్సు! ఒక మొగుడు! ఒక పెళ్ళాం! అంతేకాదు... ఎంపికాలు .కులం ...వర్గం ...వర్ణం...హోదా... ఈ ఎంపికలన్నింటివల్లా తగిన వరుడు దొరకడమే కష్టమౌతోంది !''

''అయితే, పాతరోజులే మంచి వంటావా నాన్నా ?''

''ఎలా అంటాను ? కాలం మారిపోతూ ఉంటుంది. కాలంతోబాటు మనుష్యులూ మారాలి. పాత నియమాలు, ముందు తరంమీద కూడా రుద్దుదామని చూస్తే అనర్థానికే దారితీస్తుంది — నన్నడుగుతే పెళ్ళే అవసరం లేదంటాను ! తనకు నచ్చినవాణ్ణి, తనకు నచ్చిన ఆమెనీ ఎంచుకొని కాపురం పెట్టడమే ! కులం, మతం, హోదా, డబ్బు, ఇవేమీ అడ్డు రాకూడదు !''

''మీరన్నది మరీ బాగుంది ! మన పూర్వీకులు వెర్రివాళ్లయి ఇవన్నీ నిర్ణయించేరా ? మరి నీతి, నియమం, ధర్మం.. ఇవన్నీ ఏమవాలి ?'' అమ్మ అడ్డొచ్చింది —

''ఏది చలామణీ అయితే అదే నీతి, నియమం, ధర్మం ఔతోంది ! మార్పే వీలుకాదని పట్టుక కూర్చుంటే ఎట్లా ? ఏది మానవతాపూరితమైనదో అదే న్యాయం, ధర్మం, నీతి ! తక్కినదంతా అవినీతి ! పెద్దలని గౌరవించవలెనూ అంటారు... ఏ పెద్దల్ని గౌరవిస్తున్నారు ? డబ్బు, అధికారం ఉన్నవాళ్లే పెద్దలగా పరిగణించబడుతున్నారు. అవి లేనివాణ్ని, అతడికి చదువూ, పాండిత్యం ఉన్నా చిన్నచూపు చూస్తున్నాం ! దొంగతనం చెయ్యరాదు. అని నీతి చెప్తారు... ఏది దొంగ






SANDOZ

తనం ? ఏది దొంగతనం కాదు ? అంటే మళ్ళా మడతపేచీ వస్తోంది — ప్రభుత్వం ఇష్టమొచ్చినట్టు పన్నులు రూపేణా వసూలు చేసి, ఆ డబ్బుని ఇష్టమొచ్చినట్టు ఖర్చు చేసి దుర్వినియోగపరుస్తే అది న్యాయం — అలానే ఇష్టమొచ్చినట్టు ధరలు పెంచి బీదప్రజలని దోచుకొనే వాణిజ్య ప్రముఖులూ దొంగలు కారు ! ఈ వాణిజ్య ప్రముఖుడి ఇంటికి ఏ దొంగన్నా కన్నం వేసి అతడి ఉంపుడుకత్తె కోసం కొన్న పతకం ఎత్తుకపోతే అది దొంగతనం ! అబద్ధం ఆడరాదూ అంటారు. తెల్లారి లేచిన్నించీ గుక్కకి వెయ్యి, జిహ్వకి వెయ్యి అబద్ధాలాడందీ పెళ్లు మీది మీదికి వెళ్లలేరు రాజకీయాలు అబద్ధాలమయం — కోర్టులలో సాక్షులు చెప్పేవన్నీ అబద్ధాలే — ఈ నీతినియమాలు మనలాంటివాళ్ల కోసం ఉన్నాయి — మనమూ అబద్ధాలాడేస్తే మరి వాళ్ల గతేం కావాలి ? మనం నీతిగా నడుచుకొని, నిజంగా ప్రవర్తిస్తే కదా వాళ్ళు అనువుగా తీసుకొని లాభాలు పొందుతార ?'' నాన్న లెక్చరు

ఈ లెక్చరు ఒక చెవిని వింటూ చంపా దీపం వెలిగించి, పుస్తకాలు ముందు పడేసుకొని కూర్చుంటుంది -- భోజనానికి పిలుపు వచ్చేవరకూ చదువుతుంది అప్పుడప్పుడు అప్పారావు మనసులో మెదులతాడు - నాన్న చెప్పిందీ నిజమే అనిపించేది

## 21

డింగ్ డాంగ్ ! డింగ్ డాంగ్ ! డింగ్ డాంగ్ !

శబ్దాలనీ, నిశ్శబ్దాన్నీ చీల్చుకొని చర్చి గంటల శబ్దం ఊరల్లా వినిపిస్తోంది. ఆ శబ్దంలో ఏదో పవిత్రత -- క్రీస్తు గంభీరమైన వాక్కు చర్చికి రమ్మని భక్తులని ఆదేశిస్తున్నట్టు !

లిల్లీ తమ ఇంటి వరండామీదికి వచ్చింది. ఎరుపు తెలుపురంగు మిళితమైన కలువలా ఉందామె — ఆమె శరీరం రంగు తెలుపు, బంగారు రంగుకీ మధ్య కట్టుకున్న చీర తెలుపు — రవిక ఎరుపు

సిల్కు స్కార్ఫు తలకి చుట్టుకుంది

ముఖానికి పౌడరు కొట్టుకోకపోయినా, పెదవులకి రంగు వేసుకోకపోయినా, ఆమె ముఖం అప్పుడే విడ్డ గులాబీలా ఉంటుందని, ఆమె స్నేహితురాళ్ళు చెప్పడమే కాదు, ఆమె చేతిలో ఉన్న బైబిల్‌లో భద్రంగా దాచుకున్న ఉత్తరంలో కూడా ఉంది.

వరండాలోకి వచ్చిన ఆమె, తోటలోని గులాబులనీ, చేమంతులనీ, బంతిపూలనీ ఆనందంగా గమనించింది ఎండలో నిలబడి తన్మయత్వంతో సూర్యుడికేసి ఓసారి చూసి, ఉత్తరం బైబిల్ లోంచి తీసి చదువుకుంది.

ఇది కవిత్వమా, లేక నిజమా ? ఉత్తరం చదువుతూ ఉంటే ఏదో పారవశ్యత ! రామం ఎంత అందమైన ఉత్తరాలు రాస్తాడు ! ఇంజనీరింగ్ ఆఖరి ఏడు పాసయిపోగానే ఉద్యోగం ఉద్యోగం దొరగ్గానే తమ పెళ్ళి !

తల్లిదండ్రులనీ, కులం పెద్దలనీ కాదని తనని చేపడతాడా ?

''నిన్ను చర్చిలో పెళ్ళాడమన్నా ఆడతాను !



నా కటువంటి అభ్యంతరాలు లేవు !'' అన్నాడు ఉత్తరంలో!

తనమీద రామంకి ఉన్నది ప్రేమా, మోహమా? ప్రేమకీ, మోహానికీ ఏమన్నా భేదం ఉందా? ఏమో? తనకి తెలీదు ! వాళ్ళ కుటుంబంతో పరిచయం పెంచుకుందుకి తను ప్రయత్నించింది చంపా తప్ప మరెవ్వరూ తనతో కలుపుగోలుగా మాట్లాడలేదు ! లిల్లీ చంపాకన్న వయస్సులో పెద్దది కాబట్టి, లిల్లీ కూడా మనసు విప్పి మాట్లాడదు

ఏడాది క్రితం మార్కెట్లో కనిపించినప్పుడు పలకరించింది —

''మెడిసిన్‌కి ఎంట్రెన్స్ పరీక్ష ఇచ్చేరా ?'' చంపా అడిగింది

''ఇవ్వడం . పరీక్ష పోవడం జరిగింది ''

''సో సారీ !''

''ఎందుకూ విచారం ? బి ఎస్సీ కంటిన్యూ చేస్తాను !''

### నువ్వు దూరమైతే

నీపై కవిత రాద్దామని
కలం కాగితంపై పెడితే
అందులోని సిరా
కన్నీరై కాగితంలో ఇంకింది

నీపై ప్రేమను
సితార్ తీగెలపై పలికిద్దామని
పలారంగా మీటితే
విషాద గీతాలై రోదించాయి

నీ చిత్తరువు గీద్దామని
కుంచెను కదిలిస్తే
ఆబ్‌స్ట్రాక్ట్ పెయింటింగ్‌లా
అర్థంకాని గీతలు గీసింది

మల్లిక్

ఇలా జరిగిన సంభాషణలో ఇద్దరూ రామం గురించి మాట్లాడలేదు — కాని వారి మనసులలో మెదుల్తున్నది రామమే. చంపాని చూడగానే, ఈమే రామం చెల్లెలు అని లిల్లీకి అనిపించి, ఆమెకు రామం ముఖం అగుపిస్తుంది. లిల్లీని చూడగానే చంపకి ''ఈమెని రామం అన్నయ్య పెళ్ళి చేసుకుంటాడా నిజంగా ?'' అనిపిస్తూ . ఏదో చెదురుగా అనిపిస్తుంది

లిల్లీ అంటే చంపకి ఇష్టమే — కాని లిల్లీని రామం పెళ్ళి చేసుకుంటే తమ కుటుంబాని కెన్నో ఇబ్బందులు ! తమ బంధువర్గంలో తాము వెలివేయబడినట్టవుతారు ! లిల్లీని అమ్మ కోడలిగా చూడదు! అమ్మకి బెంగగానే ఉంది ... ఈమె మాయల్లో రామం పడితే చంపాకి మరి పెళ్లి కాదేమోనని ! అందువల్ల చంపా, లిల్లీ ఎప్పుడన్నా కలుస్తే, చదువుల సంగతులు మాట్లాడివిడిపోయేవారు —

గార్డెన్‌లో నిల్చొని రామం రాసిన ఉత్తరం ప్రేమగా చదువుకుంది లిల్లీ — జనవరిలో హిందువుల పండగ.. డిసెంబర్‌లో తమ పండగ — క్రిస్ట్‌మస్ బహుమతి ఏదో పంపేడట ! ఏం పంపేడో ? ఉత్తరానికి పులమబడ్డ సెంటు మరోసారి వాసన చూసి పారవశ్యం అనుభవించింది లిల్లీ !

''అమ్మాయ్ ! తయారుగా ఉన్నావా ?'' శాంతమ్మ లోనుంచి కేక !

లిల్లీ జవాబివ్వలేదు—అమ్మకి జవాబివ్వాలంటే ఏదో అనుభూతి గొంతు కడ్డుపడుతుంది. ఎందుకీ విముఖత తనకి అమ్మమీద ? అమ్మ తనకేం తక్కువ చేసింది ? తననెంతో ప్రేమగా చూడడమేకాక, భావాలలోనూ, నడవడిలోనూ తనకెంతో స్వాతంత్ర్య మిచ్చింది రామానికీ, తనకీ ఉండే స్నేహం ఎక్కువయి ప్రేమగా మారడానికామె సహాయపడిందే కాని అడ్డుపడలేదే ?

మరో విధంగా ఆలోచిస్తే తల్లి ఇదంతా తన స్వార్థం కోసం చేసిందేమో ? స్వేచ్ఛ అన్నది ఎవరికి వారిదే హక్కు, అన్న నిజం నిరూపించుకుందుకేమో?

తన తండ్రి ముఖం ఎప్పుడో చిన్నవాడు చూసింది. నవ్వుతూ, నవ్వించే నాన్న.. ఆ నడి వయసులోనే గుండెజబ్బొచ్చి పోయాక, అమ్మ ఎంతగా ఏడ్చిందనీ ?! కానీ తరవాత ? అమ్మ, నాన్ననే మరిచిపోయిందా ? మరిచిపోయిందనడానికీ వీల్లేదు ! ఎప్పుడూ, నాన్న గొప్పతనం గురించి తనకి చెప్తుంది — నాన్న ఫోటోకి పువ్వు పెడుతుంది రోజూ —

కాని హాయిగా, ఆనందంగా ఉండేందుకు ప్రయత్నిస్తుంది అమ్మ ! ఎందరో తన స్నేహితులని ఆహ్వానిస్తుంది - వారితో తిరుగుతుంది — తన ఆనందమార్గాన తాను పయనిస్తుంది — అమ్మ గురించి అందరూ చెడుగా అనుకోవడం తాను వినకపోయినా, వారి ముఖాలమీది భావాల కర్థం లిల్లీకి తెలుసు ! ఇప్పుడు అమ్మ కొంత మారింది .. తాను (లిల్లీ) పెద్దదయింది కాబట్టే... మిత్రులతో పరిచయం తగ్గించుకుంది... వారిని ఇంటికి ఆహ్వానించి కబుర్లు వెయ్యడం మానింది

ఈ ఇంటినించి, ఈ ఊరునించీ ఎక్కడికో పోవాలని నిత్యం తపన ! తన ప్రార్థనలకి జవాబుగా క్రీస్తుప్రభువు రామంని తనకి ఇచ్చేడు !

డింగ్ డాంగ్ ! డింగ్ డాంగ్ ! డింగ్ డాంగ్ !

చర్చి గంటలు మోగుతున్నాయి . జయం పలికేయి !

శాంతమ్మ తెల్లటి దుస్తులలో వరండామీదకి వచ్చింది బలిసిన బాతులా కనిపించింది

''వెళ్దామా లిల్లీ ?'' అడిగింది. లిల్లీ తల వంకించింది, మాటలతో జవాబివ్వడం ఇష్టంలేక !

ఇద్దరూ బయల్దేరేరు చర్చికి, కాలి నడకని. ఇంటికి అరమైలు దూరానే ఉంది చర్చి. దారి కడాకూ, ఎవరో ఒకరు పలకరిస్తూనే ఉన్నారు. అమ్మ చిరునవ్వుతో జవాబు చెప్తూనే ఉంది. లిల్లీ కేసి వారు చూసిన చూపులు, లిల్లీ అందుకోకుండా ఎటో చూస్తున్నట్టు నటిస్తూ నడిచింది.

ఈ పట్నంలో ఉన్న క్రిస్టియన్ కుటుంబాలు వందో, రెండు వందలో — ఎక్కువమంది అలగా జనం హిందువులలో తక్కువ కులంలో ఉండి, వారివల్ల హీనంగా చూడబడ్డందువల్ల క్రిస్టియన్లుగా మారిపోయినవారు — మిషనరీల వల్ల క్రిస్టియన్లుగా మార్చబడ్డవారు చాలామంది క్రిస్టియన్లుగా




"ఎందుకంటే మేము సూపర్ డస్ట్ టీనే వాడతాం. దానియొక్క చిక్కటి డికాక్షన్, అమోఘమైన రుచి మా అందరికి ఎంతో నచ్చుతుంది. అదిగాక అది వాడితే చాలా మితవ్యయం కూడా. సూపర్ డస్ట్ టీ తప్ప మరియే యితర టీ మా కుటుంబంలో వాడేందుకు వొప్పుకోరు. అందుకని మా కుటుంబం "సూపర్" కుటుంబం అని పిలువబడుతుంది."

**సూపర్ రుచి. సూపర్ డికాక్షన్. సూపర్ మితవ్యయం.**

## బ్రూక్ బాండ్
# సూపర్ డస్ట్

**భారత దేశంలో అత్యధికంగా అమ్మబడుచున్న ప్యాకెట్ టీ**

# సుబ్రమణ్యంగారి కుటుంబం ఎందుకు 'సూపర్' కుటుంబం అయింది?

HTC-BBL-3986

## స్పందన

మారడం వల్ల వారికి కులహీనతా దోషం పోవడమే కాక, రైల్వేల్లోనూ, గవర్నమెంటులోనూ, వివిధ శాఖల్లోనూ ఉద్యోగాలు దొరికేవి.

లిల్లీకి, శాంతమ్మ చెప్పే సంగతులు గుర్తుకొచ్చేయి. తమ ముత్తాతల కాలంలో తమది బ్రాహ్మణ కులంట! తన తాత హిందూ మతం వదిలేసి, క్రిస్టియన్ అయిపోయేడుట — ఎందుకు? తాతకుండే ఇద్దరు మగ సంతతీ యవ్వనం రాకుండానే చచ్చిపోయేరుట — ఒకరు అమ్మవారు వచ్చి — ఒకరు కలరా వచ్చి. హిందూ దేవుళ్ళని ఎంత ప్రార్థించినా లాభం లేకపోయిందిట — ఆఖరికి మిగిలిన మూడో కొడుక్కి టైఫాయిడ్ వస్తే, హిందూ దేవుళ్ళని ప్రార్థించకుండా, క్రిస్టియన్ దేవుళ్ళని ప్రార్థించేడుట. ఒక క్రిస్టియన్ మిత్రుడి ప్రోత్సాహమ్మీద— ఆ కొడుకు దక్కడంతో క్రిస్టియన్ మతం పుచ్చుకున్నాడుట — జందెం తెంపేసేడుట.

# బొమ్మల మహాభారతం — భారత యుద్ధం — మండపాక సీతారామాంజనేయులు

(గత సంచిక తరువాయి)
























# ప్రకృతి కానుక ప్రతి ఒక్కరికీ కోమల,యవ్వన ఛాయ సర్వాంగాలకి

పోర్చుగీస్‌లో వేప పేరు మార్గోసా వివిధ రూపాల్లో వేప దేహానికి, చర్మానికి చేసే విశేషమైన మేలుకు తిరుగులేదు అందుకనే తరతరాలుగా వేప అన్న అంత ఆదరణ

మార్గో సబ్బు ఒక్కటిలోనే అధిక భాగం వేపనూనె వుంది శుద్ధమైన, సహజసిద్ధమైన మార్గో సబ్బు శరీరాన్ని పరిశుభ్రంగా నుంచి అంగాలన్నిటి చర్మాన్ని సంరక్షిస్తుంది

ప్రకృతికి తరలండి మార్గోతో స్నానం చెయ్యండి మీరు ప్రతిసారి స్నానం చేసేక మీ శరీరమంతా పరిశుభ్రంగా, తాజాగా, మెరుస్తూ వుంటుంది

**శరీరమంతా పరిశుభ్రం**

**తల్లిలా చేసే సంరక్షణ**



లిల్లీ ఎన్నోసార్లు ఈ మతం గురించి ఆలోచించింది ఈ మతం అన్నదేమిటి ? ఇందరు వివిధ రకాల దేవుళ్లుంటారా? దేవుడంటే, అది మానవుడి మేధస్సు యొక్క సృష్టా, లేక నిజంగా మానవాతీతమైన శక్తి ఉంటుందా ? ఉంటే అతడ్ని తెలుసుకుందుకి ఇంత అవస్థ ఎందుకు ? దేవుడన్నవాడే ఉంటే ఒక్క మనిషి కోసమే ఉన్నాడా లేక అన్ని జీవరాసుల కోసం ఉన్నాడా ? ఆ జీవరాసులలో కూడా హిందువులు, క్రిస్టియన్లు, ముస్లిమ్‌లూ ఉంటాయా ? ఈ మతం, దేవుడూ అన్న భావాలు అతి పురాతనమైనవి కావా ? ఇదంతా చాదస్తమని ఎన్నోసార్లనిపించింది ! కాని వీటినన్నింటినీ అధిగమించాలంటే తనకి సాధ్యమా ? రాముని తను పెళ్లాడితే పిల్లలు ఏ మతానికి చెందుతారు ?

శాంతమ్మ, లిల్లీ చర్చి చేరుకున్నారు లోనికి వెళ్లి ముందు కూర్చున్నారు. దేవుడి ప్రార్థన ప్రారంభమయింది అందరూ ఏక కంఠాన ప్రార్థన ప్రారంభించేరు ఒకే శృతిలో. అందరి గొంతూ కలిసిన ఆ ప్రార్థన ఆర్ద్రత చర్చి గోపురాన్ని చీల్చుకొని, ఆకాశంలోకి చొచ్చుకుని, దేవుణ్ణి చేరుకున్నట్టుంది

ప్రార్థన ఎవరు చేసినా, ఏ దేవుణ్ణి చేసినా, మనసు, ఆ దేవుడన్న భావంమీద లగ్నం చేసినప్పుడు, అందరికన్నా పెద్దదయిన శక్తికి మన బాగోగులు అప్పగించేస్తాం అనుకున్నప్పుడు, మనస్సు తేలిక పడుతుంది —

ఈ ప్రార్థన విషయంలో లిల్లీకి ఎన్నో సందేహాలు — కసాయివాడూ ప్రార్థిస్తాడు, సాధువు

## స్పందన

ప్రార్థిస్తాడు — మేకని దేవుడికి నైవేద్యం పెట్టి, మొక్కరిల్లి కసాయివాడు మేక పీక ఉత్తరించేస్తాడు— అలానే కోటి మానవుల రక్తం తాగే నియంతుడూ, దేవుణ్ణి రోజూ ప్రార్థించి, తనని ఆ దేవుడు కాపాడుతున్నాడని భావిస్తాడు — దేవుడి దృష్టిలో అందరూ సమానులేనా ? పాపాత్ములూ, పుణ్యాత్ములూ, ధనవంతులూ, ధనహీనులూ అందరికీ దేవుడి కృపాదృష్టి దొరుకుతే, మరి మంచివాడయి ఉండి లాభం ఏమిటి, బాధలు పడ్డానికి తప్ప ? ఓసారి అమ్మని ఈ ప్రశ్న వేస్తే అమ్మ తలకేసి నవ్వుతూ చూసి అనేది "దేవుణ్ణి ఎంత ప్రార్థించినా పాపాత్ముడుకి ఆత్మ శాంతి దొరుకుతుందనుకున్నావా ?"

"నీకెలా తెలుసమ్మా ?"

"చరిత్ర సాక్ష్యం .! అంతేకాక పాపాత్ములు ఈ లోకంలో సుఖాలు అనుభవించవచ్చును కాని పరలోకంలో అంతా నరకానికే పోతారు — అక్కడ నానా బాధలూ పడతారు —"

"శరీరాలు ఉండవు కదా ? బాధలెలా పడతారు ?"

"ఆత్మలు బాధలు పడవంటావా ?"

లిల్లీకివేవీ అర్థం కావు —

ప్రార్థన పూర్తయింది — తరవాత ఫాదర్ లూకా బైబిల్‌లో 'జాన్' చాప్టర తెరిచాడు.. 31వ వెర్స్‌ని ముందు పెద్దగొంతుతో గంభీరంగా చదివి తరవాత బోధపరచడం ప్రారంభించేడు — "నా మాటలని మీరు నమ్మి ఆచరించినట్టయితే మీరు నాకు నిజమైన శిష్యులౌతారు ? సత్యాన్ని తెలుసుకుంటారు ? సత్యం మిమ్మల్ని బంధాలనించి విముక్తులను చేస్తుంది ! పాపం చేసే ప్రతి ఒక్కడూ పాపానికి బానిసగా మారక తప్పదు !" అంటూ చెప్పడం ప్రారంభించేడాయన — ఈ పాప పుణ్యాల మీమాంస ఎప్పుడూ తెగేది కాదు ! మనిషి పాపం చేస్తూనే ఉంటాడు.. ఈ మతాధికార్లు ఇలా బోధనలు చేస్తూనే ఉంటారు. అనుకుంది లిల్లీ —

ఒక గంట తరవాత చర్చినించి ఇంటికి తిరిగి వస్తూ లిల్లీ అడిగింది "అమ్మా ! నేను స్వర్గానికి వెళ్తానా ? నరకానికా ?"

శాంతమ్మ నవ్వుతూ... "నరకానికే !" అంది.

"ఎందువల్లనమ్మా ?"

"హిందూ బ్రాహ్మణుడ్ని పెళ్లాడి అతడి తల్లిదండ్రులను కష్టం కలిగించ దలచుకున్నావు కాబట్టి !"

"అతను కూడా నరకానికేనా ?"

"హిందువులెన్ని పాపాలు చేసినా, ప్రాణం పోయే ముందు వాళ్ల దేవుణ్ణి తలచుకుంటే స్వర్గానికి పోతారట !"

"ఆ సులువు మనకీ ఉంది కదా ? పశ్చాత్తాప పడి ఒప్పుకుంటే ?"

"వాళ్ల స్వర్గం నరకం వేరు. .మనవి వేరు!"

"చచ్చేక కూడా మతం మనల్ని వదలదా అమ్మా ?"

శాంతమ్మ జవాబివ్వలేదు

(ఇంకా ఉంది)

మీ చర్మ యవ్వన సౌందర్య రహస్యం, ఇప్పుడు మీ చేతిలోనే వుంది.
హిమానీ గ్లిసరిన్ సబ్బు నిర్మలంగా శుద్ధమైనదిగా వుందంటే
60 సంవత్సరముల అనువాయుతీగా వస్తున్న స్థిరమైనస్థాయి.

పరిశుద్ధమైన గ్లిసరిన్ సబ్బు ఇదే మీ చర్మాన్ని యవ్వనంగా
ఉంచుతుంది, చర్మం ఆరకుండాను, ముడతలు పడకుండా సదా ఉంచుతూ
చర్మమను కాపాడుతుంది. ఇంత పరిశుద్ధమైనది మరి ఏ యితర
గ్లిసరిన్ సబ్బు దీనిలా లేదు—మృదువైన హిమానీ



ఎక్కువ నురుగుతో హిమానీ మీ ప్రతీ అంగాలలో సున్న మురికిని నిర్మూలించగలదు.

మీ చర్మాన్ని ఏ విధంగా వుంచాలో అటువంటిదే హిమానీ ఒక స్వచ్ఛమైన పారదర్శకమైన సబ్బు.
ఇప్పుడు మీ పట్టణానికి కూడా వచ్చింది.

గ్యారంటీ



'ప్రేమ సింహాసనం'లో
ఎన్ టి.ఆర్ , రతి

## ప్రేమ సింహాసనంలో ప్రేమతో ప్రహసనం !

కొండలు కోనలు...పచ్చని చెట్లతో ఆ ప్రాంతం రమణీయంగా ఉంది ఆ ప్రకృతి సౌందర్యాన్ని కుంచెతో చిత్రీకరిస్తోంది ప్రేమ (రతి) అక్కడికి రాజా (ఎన్ టి ఆర్.) "హాయ్, మై లవ్! ఏం చేస్తున్నావిక్కడ ?" అంటూ వచ్చాడు

"నీతో మాట్లాడలేను, మహాప్రభో! కాలికేస్తే, వేలికేస్తావ్. వేలికేస్తే, కాలికేస్తావ్ ?"

"కాలికీ, వేలికీ కాదు త్వరలో నీ మెడకు వేస్తాను – మూడు ముళ్ళు"

"ఇదిగో – నన్ను రెచ్చగొట్టకు నాకు పిచ్చెక్కిందంటే ఏం చేస్తానో తెలుసా ?"

"అవునూ ని ఇష్టం వచ్చినట్లు బొమ్మలు గీసేస్తున్నావ్ ! ఇదేమన్నా నీ బాబుగాడి ఎస్టేటనుకున్నావా ?"

"ఏం, నీ బాబుగాడి ఎస్టేటా ?"

"ఏస్ ఇది మా తాతగారి ఎస్టేట్.. ఓ–కే. గియ్యడం అయిపోయింది గనుక – ఆ కొండకు పది వేలూ, సూర్యుడికి పాతిక వేలూ, చెట్లకు యాభై వేలూ. . సరే, చిల్లరగా ఎందుక్కాని – మొత్తం ఓ ఎనభై అయిదు వేలు ఇచ్చేయ్. . కమాన్ ! క్విక్ !"

"ఏమిటీ – ఎనభై అయిదు వేలా ! ఏం, ఆ కొండ, సూర్యుడు కూడా నీవేనా ?"

"ఏస్ అచ్చంగా మావే బ్యూటీఫుల్ – ఇవ్వాళ సెలవు పెట్టాడు చంద్రుడు. వాడుకూడా మావాడే !"

"ఆహా ! అయితే, దూరంగా కనబడుతున్న ఆ గెస్ట్‌హౌస్ కూడా మీదేనా ?"

"అవును. మాదే ఏం, అనుమానమా ?" అన్నాడు రాజా తటపటాయించకుండానే.

"అబ్బే ! నువ్వు అబద్ధం ఎందుకు చెప్తావు గనుక ? చూడూ. . ఆ గెస్ట్‌హౌస్‌లోనుంచి కింద లోయ అందంగా కనిపిస్తుందంటారు. ఒక్క బొమ్మ గీసుకుంటాను. అక్కడికి తీసుకెళ్లవూ ?"

"ఓ–కే . దానికేం – తీసుకెళ్తాను. ఇవ్వాళ ఓనర్స్‌తో మాట్లాడి ." ఈమారు రాజా తడబడక తప్పలేదు

"ఓనర్స్‌తోనా ?" ప్రేమ విస్తుపోయింది.

"అదే. ఓ 'నర్స్'తో మాట్లాడి – అన్నాను; ఓనర్స్ కాదు – మా తాతగారిని చూసుకునే నర్స్. మా బాబాయిలు కూడా ఉంటున్నారక్కడ. ఆ నర్స్‌తో మాట్లాడి " అన్నాడు రాజా.

"ప్లీజ్, రాజా ! ఇంతేనా ?" అంది ప్రేమ అలవోకగా చూస్తూ.

"ఇదే – ఈ చూపుతోనే ఆడవాళ్ళు ప్రపంచ యుద్ధాలు, ప్రళయాలు పుట్టించెయ్యగలరు. తప్పుతుందా ? పద " అంటూ బయలుదేరాడు రాజా. "థాంక్యూ !" అంటూ ప్రేమ అనుసరించింది.

చిత్రీకరణ పూర్తయ్యాక "గెస్ట్‌హౌస్ తనదని బుకాయించిన రాజా తీరా అక్కడికి వెళ్ళాక తన అబద్ధాన్ని కప్పిపుచ్చడానికి నానా యాతనలు పడవలసి వస్తుంది," అంటూ తదుపరి సన్నివేశాన్ని తెలియజేశారు ఈ చిత్ర కథకుడు, దర్శకుడు బీరం మస్తాన్‌రావు కె. విద్యాసాగర్ నిర్మించే "ప్రేమ సింహాసనం" చిత్రానికి తెరముందు కె ఆర్ విజయ, మంజుభార్గవి, నూతన్‌ప్రసాద్, మోహన్‌బాబు, ఎస్ వరలక్ష్మి, జయమాలిని – తెరవెనుక జంధ్యాల. చక్రవర్తి, ప్రకాష్, నరసింహారావు, ప్రసాద్ వై. నాగేశ్వరరావు, సింధే కృషి చేశారు.



## పండంటి జీవితంను భగ్నం చేసిన విషయం !

శేఖర్ (శోభన్‌బాబు) సూటిగా సంధ్య (సుజాత) కళ్లల్లోకి చూశాడు. "చెప్పు! ఎందుకు చేశావీ పని? నా చెల్లెలు నీకేం అపకారం చేసింది? దాని బతుకు ఎందుకిలా బుగ్గిపాలు చేశావ్? చెప్పు!"

"దీనికంతకీ కారణం నేనంటారా?" రాష్‌గానే అడిగింది సంధ్య.

"నువ్వే! మొదట్నుంచీ నా చెల్లెలంటే నీకు ఈర్ష్య, ద్వేషం. అందుకే — ఆ రోజు దొంగతనం అంటగట్టి, ఇంట్లోంచి వెళ్లగొట్టావు. ఇవాళ ఈ లోకం నుంచే సాగనంపావు."

"స్టుపిడ్! నోటికొచ్చినట్లు మాట్లాడకండి. అసలు మీ చెల్లెల్ని నాశనం చెయ్యటం వల్ల నాకొచ్చే లాభం ఏమిటి? నేలాంటి పని చేశానని ఎవరైనా చెప్పారా — మీరెలా నమ్మారండి? నేనంటే మీకు అంత నీచమైన అభిప్రాయం ఉందన్నమాట? ఎవరో అన్నమాటలు పట్టుకొని, నా మీద విరుచుకు పడతారు. సిగ్గు!"

"ఏం, చేసిన పని సమర్థించుకుంటున్నావా?"

"తప్పు చెయ్యనప్పుడు తల వంచాల్సిన అవసరం లేదంటున్నాను చూడండి. నేనేం మీ చేతి కింద నీళ్లు తాగి బతకడంలేదు. మీరు నాకేం అన్నం పెట్టి పోషించక్కర్లేదు. నా ముఖం చూడకపోతే గడవంది మీకు."

"సంధ్యా!" ఆవేశంతో చెయ్యెత్తాడు శేఖర్.

"ఆగండి! నా మీద చెయ్యెత్తే అర్హత మీకు లేదు. మీరుండేది నా ఇంట్లో."



'స్వర్గం' లో జయసుధ



"ఓహో! అలాగేం? నీ ఇంట్లో నువ్వే ఉండు. నేను ఒక్క క్షణం కూడా ఇక్కడ ఉండను," అంటూ శేఖర్, బిడ్డను ఎత్తుకున్నాడు.

"ఆగండి! బాబును ఎక్కడికి తీసుకెళ్తున్నారు?"

"నీ నీడ పడని చోటికి, నీ జ్ఞాపకాలు కూడా తాకని చోటికి. నా బిడ్డలాగా పెంచుకుంటాను," అంటూ శేఖర్ వడివడిగా వెళ్లిపోయాడు.

సంధ్య కనుకొలకుల నుంచి అశ్రువులు జలజలా రాలాయి.

తాతినేని రామారావు దర్శకత్వంలో విద్యే రామారావు నిర్మించిన శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ "పండంటి జీవితం" చిత్రానికి భీశెట్టి కథకుడు, గొల్లపూడి సంభాషణకర్త, చక్రవర్తి సంగీత దర్శకుడు.

## చంద్రశేఖర రెడ్డి దర్శకత్వంలో కొత్త చిత్రం

"శరత్‌బాబు తండ్రీ కొడుకులుగా కనిపించబోతున్నాడు," అన్నారు పి సి రెడ్డి. ఈయన దర్శకత్వంలో హేమా వెంకటరమణారెడ్డి సమర్పించే యామినీ ప్రొడక్షన్స్ 'ఇల్లాలే ఇలవేల్పు' చిత్రంలో శారద, సరిత అత్తా కోడళ్లుగా నటిస్తారు. రమాప్రభ, రీన, మోహన్‌బాబు, అల్లు రామలింగయ్య, రాజన్‌బాబు తక్కిన పాత్రధారులు. మద్దిపట్ల సూరి, సత్యం, ఎం సి శేఖర్, కె ఎస్ ఎన్ మూర్తి, వి అంకిరెడ్డి ప్రభృత సాంకేతికవర్గం. "డిసెంబర్‌లో సాంగ్స్ రికార్డ్ చేసి, జనవరిలో షూటింగ్ మొదలెడ్తాం," అన్నారు ఈ చిత్ర కథకుడు, నిర్మాత డి ఆర్ చెన్నారెడ్డి. చేజెర్ల వీరయ్య సహనిర్మాత. ఈ చిత్రం తమిళంలోనూ తయారవుతుంది.



'రోజులు మారాలి'లో ఒక దృశ్యం

# సినిమా

## డైరెక్టర్ ధవళ సత్యం చిత్రాలు

''ఎర్రమల్లెలు'' కాక నటుడు రామకృష్ణ ఆధ్వర్యంలో గణేశ్ నిర్మించే ఆర్. కె. మూవీస్ చిత్రం షూటింగ్ జనవరి నుంచి మార్చి వరకు జరుగుతుంది. జి. పి. రాజ్ నిర్మించే శ్రీ సూర్యా ఫిలిమ్స్ చిత్రం మార్చి 20న ప్రారంభమౌతుంది. ''సంసారబంధం'' అనంతరం జ్యోతి శేఖర్‌బాబు ఫిబ్రవరి నెలలో కొత్త చిత్రాన్ని మొదలెడ్తారు.

## ప్రేమాభిషేకంలో హిందీ నటి !

దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో ఎ. ఎన్. ఆర్. హీరోగా వెంకట్ అక్కినేని నిర్మించే అన్నపూర్ణ స్టూడియోస్ ''ప్రేమాభిషేకం''లో హిందీ హాస్య నటి టున్ టున్, నాయిక శ్రీదేవి స్నేహితురాలిగా నటిస్తోంది. మూడవ షెడ్యూల్ నవంబర్ 21 నుంచి 30 వరకు జరిగింది. శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పిస్తున్న చిత్రమిది.



















## ఎర్రమల్లెలు తర్వాత విప్లవశంఖం !

"ప్రకాశంజిల్లాలో 'ఎర్రమల్లెలు' షూటింగ్‌ను డిసెంబర్ 8న మొదలెడుతున్నాం. ప్రపంచ కార్మిక దినోత్సవమైన మే – 1న రిలీజ్ చేస్తాం. అదే రోజున 'విప్లవశంఖం' అనే కొత్త పిక్చర్‌ను కూడా స్టార్ట్ చేస్తాం," అన్నారు నటుడు, నిర్మాత మాదాల రంగారావు. ఈయనతోపాటు "ఎర్ర మల్లెలు"లో మురళీమోహన్, రంగనాథ్, సాయిచంద్, ఎం. పి. ప్రసాద్, నాగభూషణం, ప్రభాకరరెడ్డి, సాక్షి రంగారావు, పొట్టి ప్రసాద్, చలపతిరావు, నర్రా వెంకట్, నల్లూరి, పరమానందం, తూనుగుంట, జయశీల, పుష్పకుమారి, ఒక నాయికగా నవత అనే నూతన నటి నటిస్తున్నారు శ్రీలక్ష్మి మరో నాయిక. ఇంకో హీరోయిన్‌ను త్వరలో ఎన్నుకుంటారు. ఎం జి రామారావు, చక్రవర్తి, జి. మోహన్‌కృష్ణ, రావి వెంకటేశ్వర్లు, నాయని మహేశ్వరరావు, కె. రాధాకృష్ణ (విశ్వశాంతి) ప్రభృత సాంకేతిక వర్గంతో ధవళ సత్యం స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు నిర్వహిస్తారు. నిర్మాణ సారధ్యం వహించే మాదాల రంగారావే కథకుడు కూడా. నవతరం యూనిట్‌వారి తొలి చిత్రం "యువతరం కదిలింది" నూరు రోజుల ఉత్సవమప్పుడు యూనిట్‌లోని వారికి, పంపిణీ, ప్రదర్శనశాలల సిబ్బందికీ బోనస్ ఇచ్చారు. ఈ చిత్రంలోని పాటలమీద వచ్చిన రాయల్టీని 'ప్రజా నాట్యమండలి'కి విరాళంగా ఇచ్చారు "ఎర్రమల్లెలు" చిత్రం రికార్డుల రాయల్టీని 'రాష్ట్ర విద్యార్థి యువజన సమాఖ్య'కు విరాళంగా ఇస్తున్నట్లు చెప్తూ, "యువతరం కదిలింది" నూటయాభై రోజుల ఉత్సవం విజయవాడలో జరుగుతుందని రంగారావు తెలియజేశారు

---



…లు'లో శ్రీదేవి, మధుకర్, జయసుధ



## ఇరుగు - పొరుగు

★ 'బ్రిటిష్ ఎర్ వేస్' తొలిసారిగా ఒక హిందీ చిత్ర సంగీతాన్ని విమానాలలో వినిపింప జేస్తుంది. ఆ చిత్రం "ప్రొఫెసర్ ప్యారేలాల్."

★ "యారానా" చిత్రం రికార్డులు విరివిగా విక్రయమవడం కోసం పోలిడర్ సంస్థ ఆ చిత్రంలోని ప్రతి పాట ముందు అమితాబ్ బచ్చన్‌చేత వ్యాఖ్యానం రికార్డు చేయించింది.

★ 1978 లో బొంబాయి 'మెట్రో' థియేటర్‌లో విడుదలైన "ఎ మాన్ టు రెస్పెక్ట్" అనే ఆంగ్ల చిత్రం ప్రజలను అంతగా ఆకర్షించలేకపోయింది. ఇప్పుడదే చిత్రాన్ని బొంబాయి 'న్యూ యెంపైర్' థియేటర్‌లో మళ్ళీ విడుదల చేశారు. ఇది 'కుర్బానీ' చిత్రానికి మాతృక అని పంపిణీదారులు పేర్కొన్నారట.

★ "క్రాంతి"చిత్రానికి పన్నెండు టిక్కెట్లు పంపవలసిందిగా కోరుతూ మనోజ్‌కుమార్‌కు కలకత్తా నుంచి సంజయ్ జోహార్ అనే వీక్షకుడు వందరూపాయల చెక్కును అడ్వాన్సుగా ఎంపించాడట. ఆ చెక్కును బెంగాల్ డిస్ట్రిబ్యూటర్‌కు మనోజ్‌కుమార్ పంపిస్తూ, అలా టిక్కెట్లు రిజర్వ్‌చేసి, సంజయ్ జోహార్‌కు పంపించమని కోరాడట.

★ రఫీ అస్తమించాక కిశోర్‌కుమార్ తన రేటును ప్రతి పాటకూ ఇదివరకటి కన్నా అయిదు వేలు పెంచాడట

★ "స్వామి దాదా" చిత్రంలో ఒక ముఖ్య పాత్రకు ఒక అమెరికన్ యువతిని ఎన్నిక చేయడానికి దేవ్ ఆనంద్ త్వరలో అమెరికా వెళ్లబోతున్నాడు.

### డైరెక్టర్ కె. బలేచందర్ అలవాట్లు!

బాలచందర్ రచన సాగించేటప్పుడు టేప్ రికార్డర్‌లోంచి తగ్గుస్థాయిలో ఎం. ఎస్. సుబ్బులక్ష్మి, బాలమురళీకృష్ణల కర్నాటక సంగీతం వినిపిస్తూ ఉంటుంది. తన చిత్రాల్లో పాల్గొన్న నటీనటులకు ఇతర చిత్రాల ద్వారా అవార్డులు లభించినా — వాళ్ళకు వెంటనే శుభాకాంక్షలను టెలిగ్రామ్ ద్వారా తెలియజేయడం ఈయనకు మామూలట

### ప్రేమగోల

"పార్వతీ పరమేశ్వరులు" తర్వాత పల్లవి పిక్చర్స్ తయారుచేసే "ప్రేమగోల" చిత్రంలో చంద్రమోహన్, చిరంజీవి, రావు గోపాలరావు, ప్రభ ఆదిగా గలవారుంటారు. గొల్లపూడి రచయిత సత్యం సంగీత దర్శకుడు. కోటారెడ్డి దర్శకత్వంలో ఛాయాగ్రాహకుడు ఎస్. వెంకటరత్నం నిర్మాత.








'పసిడిమొగ్గలు'లో
లక్ష్మి, అల్లురామలింగయ్య, రాజా, అంజి

# సినిమా విశేషాలు

## సింహస్వప్నంలో చిత్రమైన పరిచయం!

స్పీడుగా వచ్చిన కారు — రోడ్డు దాటుతున్న ఓ పాపను ఢీకొనబోయింది సమయానికి రాజు వచ్చి, పాపను రక్షించాడు. కారు తుర్రుమంది. అది చూసి అక్కడికి వచ్చిన కమల "మీ పాప ..." అంటూ అనూనయంగా ఏదో చెప్పబోయింది

"నా పాప ? పెళ్ళికాని బ్రహ్మచారిని పట్టుకొని, ఇంత మాటంటారా? ఓహో ! ఇలా వంకపెట్టి మీ పాపను నాకు అంటగట్టేద్దామని చూస్తున్నారా ?" అన్నాడు రాజు (నరసింహరాజు).

"అయ్యయ్యో ! నా పాప కాదు; నా కింకా పెళ్ళి కాలేదు," అంది కమల (కార్తీక).

"మన పాప కావా ?"

ఇంతలో ఆ పాప తల్లి పరుగున వస్తూ, "అమ్మో, నా బిడ్డ ... నా బిడ్డ !" అంటూ పాపను కౌగిలించుకొని, "బాబూ ! కొత్తగా పెళ్ళయిన పార్వతీపరమేశ్వరుల్లాగా ఉన్నారు. నా ఆయుస్సు కూడా పోసుకొని, నా పాప కంటే చక్కని పాపను కని, చల్లగా జీవించండి, బాబూ! వస్తాను," అంటూ తన బిడ్డను ఎత్తుకొని వెళ్ళిపోయింది.

నిర్ఘాంతపోయి చూస్తున్న కమలతో "ఏమండీ, నాకో చిన్న అనుమానం ఇప్పుడీమె తథాస్తు అని దీవించింది. ఇదంతా చూస్తే, పూర్వ జన్మలో మీరు నా భార్య — " అంటూ ఆగాడు రాజు.

"షటప్ ! నేనెవరనుకుంటున్నావు ? నేను తలచుకుంటే, నిన్నే అరెస్టు చేయగలను."

"ఎక్కడా ? మీ బాహువుల్లోనా ? అలా చేస్తే, ఆజన్మ ఖైదీగా ఉండిపోతాను."

"ఏయ్ ! మాటలు మర్యాదగా రానియ్ !"

"చూడండి. ఇప్పుడు దీవించిన వారి దీవెనలు తప్పకుండా నెరవేరుతాయి. ఎందుకంటే — మొదట జగడంతో ప్రారంభమైన ఆడ మగల పరిచయం, ఆలుమగల దాకా వెడుతుందని మా గురువుగారు ప్రేమానందుల వారి ఉవాచ అమ్మాయిగారూ ! మీ నిజ నివాసమెక్కడో చెప్పండి. అక్కడే వాల్తాను."

"ఇడియట్ ! స్టుపిడ్ ! ఫూల్ !" అంటూ బయలుదేరిన కమలను వెంబడిస్తూ, "ఏమండీ ! నన్నేనా ? ఏదో మీరు తిడుతూంటే, నాకేం అనిపించడంలేదు," అన్నాడు రాజు

కమల వడివడిగా వెళ్ళిపోయింది. రాజు నిట్టూరుస్తూ ఆగిపోయాడు.

పి. దుర్గాప్రసాద్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ప్రసన్నకుమార్ నిర్మించిన కార్తికేయ పిక్చర్స్ "సింహస్వప్నం" చిత్రానికి దేవదాసుకోటే సంగీత దర్శకుడు విజయరత్నం రచయిత.

## కట్టా సుబ్బారావు కొత్త చిత్రం

'రామాయణంలో పిడకలవేట' చిత్రాన్ని మార్చినెల నుంచి తమిళంలో, డిసెంబర్ నుంచి హిందీలో తీయనున్నట్లు తెలియజేశారు డాక్టర్ టి. కె. ఎం. చటర్జీ. ఈయన రాం అండ్ శ్యాం పతాకంలో నిర్మించే తృతీయ చిత్రంలో మురళీమోహన్, శ్రీధర్, నూతన్‌ప్రసాద్, శారద, అత్తిలి లక్ష్మి ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. కాశీ విశ్వనాథ్ సంభాషణలు, రాజన్ — నాగేంద్ర సంగీతం, రంగా ఛాయాగ్రహణంతో కట్టా సుబ్బారావు డైరెక్టరు. ఈయన "మొదటి షెడ్యూల్ డిసెంబర్ 20 నుంచి ఉంటుంది," అన్నారు.

**-జి. వి. జి.**

పెద్దకథ

# ప్రేమిస్తే ఏమౌతుంది?

## విన్నకోట సుశీలాదేవి

"రాణీగారు మళ్లీ అలిగినట్లున్నారు!" రవి నవ్వుతూ పలకరించాడు

స్వాతి మనస్సు బాధగా మూలిగింది "రవీ! అలా మాట్లాడకు! నా గుండెలు బద్దలయి పోతాయి!" అనుకుంది.

స్వాతికి దగ్గరగా కుర్చీ జరుపుకుని "అలా వున్నావే?" అంటూ చేతిని పట్టుకున్నాడు

స్వాతి చేయి విదిలించుకుంది.

"స్వాతీ! కోపం నీకెంత అందాన్నిచ్చినా, రోజూ ఇలా అలగడం ఏం బాగాలేదు!" అన్నాడు.

"రవీ! వచ్చే నెలలో నా పెళ్ళి!" అంది స్వాతి నెమ్మదిగా

"ఓ అదా! నీ పెళ్ళి కాదు, మన పెళ్ళి అనాలి స్వాతీ! నాకు మాత్రం లేదా త్వరగా పెళ్ళి చేసుకోవాలని! ముందు రాధ పెళ్ళి కావాలని నువ్వే పట్టుబట్టావ్! రాధకి సంబంధాలు చూస్తున్నా ఎలాగైనా సరే వచ్చే నెలలో మన పెళ్ళి జరుగుతుంది సరేనా?"

రవికి ఎలా చెప్పాలో తోచలేదు "అదికాదు రవీ! నాకు పెళ్ళి సంబంధం చూస్తున్నారు నాన్న"

రవి తెల్లబోయాడు –

"స్వాతీ! నిజమేనా! మరి నువ్వు మన విషయం చెప్పలేదా!"

"ఉహూ!"

"ఏం?"

"ఏముంది! ఆ అబ్బాయి మీకంటే బాగుంటాడు. మంచి వుద్యోగం, బోలెడంత డబ్బు వుంది. ఇంకెందుకు కాదనాలి?"

స్వాతి మాటలు పూర్తి అయ్యాయో లేదో, స్వాతి చెంప ఛెళ్లుమంది.

"స్వాతీ! ఇంకోసారి అలా మాట్లాడవంటే, జాగ్రత్త!" రవి కళ్లు నిప్పులు కురిపిస్తున్నాయి.

"రవీ" అంది బాధగా చెంప పట్టుకుని

స్వాతి కళ్లల్లోని నీటిని చూసి రవి తెలివి తెచ్చుకున్నాడు. రవి తనని తాను సంబాళించుకుంటూ –

"స్వాతీ! నువ్వు జోక్‌గా అన్నా నేను భరించలేను. ఆవేశంలో తొందరపడ్డాను. సారీ స్వాతీ! నన్ను క్షమించు! నా ప్రేయసిని, పూజించాల్సిన నా దేవతని ఈ చేత్తో కొట్టాను. ఛీ! నేనెంత పశువునయ్యాను! ఈ చేతిని. ." అంటూ కుడిచేతిని టేబిల్ మీద వేసి కొట్టుకోసాగాడు.

**(గత సంచిక తరువాయి)**

స్వాతి లేచి రవి చేతిని పట్టుకుంది. రవి కళ్ల నుండి నీళ్లు చెంపలమీదికి జారుతున్నాయి!

"రవీ" అంటూ స్వాతి రవి గుండెలమీద తల వాల్చి భోరుమంది.

రవి స్వాతి చుట్టూ చెయ్యివేసి ఆప్యాయంగా దగ్గరికి తీసుకున్నాడు.

స్వాతి కొద్దిసేపటికి తెప్పరిల్లింది. ముఖం కొంగుతో తుడుచుకుంది. కుర్చీలో కూర్చుంది

రవి స్వాతి కూర్చున్న కుర్చీ హేండ్‌మీద కూర్చుని –

"అసలు ఏం జరిగిందో చెప్పు స్వాతీ" అన్నాడు.

**జరిగిన కథ–4 :** రెవిన్యూ డిపార్ట్‌మెంటులో తాసిల్దారుగా పనిచేసి రిటైరయిన గోవిందరావుకు, ఆయన భార్యకు ఇద్దరు మగపిల్లల తర్వాత పుట్టిన స్వాతి అంటే అమితమైన గారాబం. స్వాతి ఓ కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తూంటుంది ఉమ కోరికమీద ఆమె బర్త్‌డే పార్టీకి వెళ్లిన స్వాతికి అక్కడ రవి పరిచయమౌతాడు. స్వాతి ఇంటికి రవి రాకపోకలు సాగిస్తుంటాడు ఆమెలో అతను చోటు చేసుకొంటుంటాడు. రవి మాటల్లో తన మావయ్య కూతురు రాధ విషయం రాగా ఎందుకో అతను తనని మోసం చేస్తున్నాడేమో! అనే అనుమానం చిగురుస్తుంది స్వాతిలో. రవి తన మావయ్యకు ఇచ్చిన మాట ప్రకారం అతను రాధనే చేసుకొంటాడని కళ్యాణి ద్వారా తెలుసుకున్న స్వాతి కుమిలిపోతుంది. కానీ, తను రాధను ప్రేమించటంలేదనీ స్వాతినే ప్రేమిస్తున్నాననీ, ఆమె ప్రేమ లభించని నాడు తాను బ్రతకననీ అన్న రవి మాటలకు ఆమె మనసు కుదుటపడుతుంది. ఆ తరువాత అతని రాక కోసం ప్రతిరోజూ నిరీక్షిస్తూంటుంది. స్వాతి కొలీగ్ కళ్యాణి మోహన్‌మీద ప్రేమకన్నా అతని డబ్బుమీదా, అతను చేయించే వస్తువులమీద వ్యామోహం ఎక్కువ చూపుతుంటుంది. తన పరిస్థితిని ఎలాగైనా ఆమెకు చెప్పాలని నిశ్చయించుకుంటాడు మోహన్. మోహన్ చెప్పిన మాటలు విని తెల్లబోయి, అతనితో తెగతెంపులు చేసుకొని, బాగా డబ్బున్న శేషగిరితో తిరుగుతుంటుంది కళ్యాణి. తన బావ తనకు దక్కేలా చేయమని అర్థించిన రాధకు, అలాగే చేస్తానని అభయం ఇస్తుంది స్వాతి.

"రవీ! మీరు రాధని పెళ్లి చేసుకోవాలి."

"స్వాతీ! ఇటువంటి తలతిక్క మాటలు మాట్లాడితేనే కోపం వస్తుంది" అన్నాడు.

"కాదు రవీ! మీకు నామీద ఏమైనా ప్రేమ వుంటే నేను చెప్పింది చెయ్యండి!" అంది.

"ముందు అసలు విషయం చెప్పు?"

స్వాతి రవి కాలిమీద తల వాల్చి రాధ వచ్చిన విషయం, తను రాధకు మాట ఇచ్చిన విషయం చెప్పింది.

రవి చటుక్కున లేచాడు

"స్వాతీ! ఎందుకలా అన్నావ్?"

"ఏమో! ఆ క్షణంలో అలా అన్పించింది"

"స్వాతీ! నా కిటువంటి పనికిమాలిన త్యాగాలంటే పరమ అసహ్యం. త్యాగం పిరికితనానికి సూచన కోరింది సాధించడమే మన పద్ధతి! నిన్ను వదిలి వేరెవర్నీ చేసుకోలేను! చేసుకోను!"

"రేపు నా కంటే అధికురాలైన అమ్మాయి కనబడితే ఆ పిల్లతోనూ ఇలాగే చెప్తారా?"

ఆ మాటతో రవి ముఖం నల్లబడింది క్షణం ఆగి బాధగా అన్నాడు –

"స్వాతీ! ఇంతేనా నువ్వు నన్ను అర్థం చేసుకుంది! నిన్ను చూశాక, నీ ప్రేమని పొందాక, మరో ఆడపిల్ల వేపు కన్నెత్తి అయినా చూడాలన్పిస్తుందా? ఎన్నింత చనయిటి కింద జమ కట్టావన్నమాట!"

స్వాతి తడబడిపోయింది

"అదికాదు రవీ! పరిస్థితులు అలా వచ్చాయి"

రవి కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి

"అటువంటి మాటలంటేనే నాకు కోపం మనం ధైర్యంగా నిలబడితే పరిస్థితులు ఏం చేస్తాయి?"

స్వాతికి ఇంకేం చెప్పాలో తోచలేదు.

"రవీ! చివరి మాటగా చెప్తున్నాను. రాధ అలా దుఃఖపడుతూంటే నేను మిమ్మల్ని చేసుకోలేను. మనని గూర్చి మరో ఆడపిల్ల వుసూరుమనకూడదు."

రవి కుర్చీలోంచి లేచాడు.

"స్వాతీ! ఇన్ని మాటలెందుకు? అసలు నీ మనసులో వున్నది చెప్పరా? నీకు నామీద ప్రేమ లేదు! మీ నాన్నగారు ఏదో మంచి సంబంధం చూశారు! అది చేసుకోవాలని వుంది! రాధ వంక చెప్తున్నావ్? స్వాతీ! నాకు అబద్ధం చెప్పే వాళ్లన్నా, మోసం చేసే వాళ్లన్నా అసహ్యం." అంటూ కోపంగా అక్కడి నుంచి వెళ్లబోయాడు.

స్వాతి చటుక్కున అతని చేయి పుచ్చుకుంది.

"రవీ! ఇందాక నన్ను అన్నారు, మరి నన్ను మీరు అర్థం చేసుకుంది ఇదేనా! నేనెంత బాధపడుతున్నానో, నా గుండెలెంత బ్రద్దలయిపోతున్నాయో మీకు తెలీదు!"

రవి చప్పున తగ్గిపోయాడు.

"స్వాతీ! అలా బాధపడవద్దనే చెప్తున్నాను. మనం పెళ్లి చేసుకుని హాయిగా వుందాం. పోనీ ఇద్దర్నీ చేసుకోనా?" అన్నాడు ఎగతాళిగా.

"ఇద్దరినేం ఖర్మ! ఇంకో నలుగుర్ని కట్టుకోండి!"

"అమ్మో! నా కంత ఓపికలేదు"

''పరిహాసం చాలించి నేను చెప్పినట్లు చెయ్యండి.''

''ఓ యెస్! వచ్చేనెలలో పెళ్లి కావాలి. అంతేనా! రేపే రిజిష్ట్రాఫీసుకెళ్లి అప్లికేషన్ పడేస్తాను. వచ్చేనెలలో మన పెళ్లి తప్పకుండా జరుగుతుంది, వస్తాను'' అని చరచరా వెళ్లిపోయాడు.

స్వాతి హతాశురాలయింది.

రవికెలా చెప్పాలి ?

ఇంకేం చెప్పినా వినిపించుకునే స్థితిలోలేదు!

రాధని కాదని తను రవిని చేసుకోలేదు!

రవీ, రాధా పెళ్లి చేసుకోవాలంటే తను వేరే పెళ్లి చేసుకోవాలి!

రవి, రాధల కోసమైనా తను జీవితంతో రాజీపడక తప్పదు.

అన్నయ్య త్వరగా వస్తే బాగుణ్ను! కొంత ఈ సమస్య పరిష్కారం అవుతుంది!

ఆలోచిస్తూ కూర్చుంది స్వాతి.

*   *   *

''కళ్యాణీ! నిన్న శెలవు పెట్టావెందుకు ?'' అనడిగింది స్వాతి.

''డాక్టరు దగ్గిరికెళ్లాను.''

''ఎందుకూ !?''

''పెద్ద విశేషం లేదు, అందరికీ వచ్చే జబ్బే వచ్చింది'' అంది మెల్లగా కళ్యాణి.

స్వాతి తెల్లబోతూ — ''అంటే'' అంది

''నా కిప్పుడు రెండో నెలనుకుంటాను.'' కళ్యాణి ఎంతో మామూలుగా చెప్పింది స్వాతి బిత్తరపోయింది.

''కళ్యాణీ !''

''అవును, ఇందులో ఆశ్చర్యపడాల్సిందేముంది?''

''మరి. మరి.. అతనితో చెప్పావా ?''

''ఎవరితో! శేషగిరితోనా! చెప్పాను పాపం! నా మీద ఎంతో జాలిపడుతూ అయిదొందలిచ్చాడు.''

''ఎందుకూ ?''

''ఎబార్షన్‌కి.''

''కళ్యాణీ'' స్వాతి భయంగా చూసింది.

ఇంతటి సమస్య ముంచుకొచ్చినా కళ్యాణి అలా ప్రశాంతంగా ఎలా వుండగలుగుతోందో అర్థం కాలేదు స్వాతికి.

''కానీ స్వాతీ! నేను ఎబార్షన్ చేయించుకోవడంలేదు. బాబుని కని, ఇడిగో నీ వారసుడు అని శేషగిరికి చూపాలని వుంది.''

స్వాతికి నోటిమాట రాలేదు. కళ్యాణి తన కెప్పుడూ అర్థం కాలేదు! కాదు కూడా! దానిదో విచిత్రమైన స్వభావం! కళ్యాణిలాటి వాళ్లు జీవితాన్ని చాలా తేలిగ్గా తీసుకుంటారు ఏదైనా సమస్యలొచ్చినా తనలా బుర్ర బద్దలుకొట్టుకోరు. అసలటువంటి వాళ్లే జీవితంలో ఎక్కువ సుఖపడతారేమో !

''స్వాతీ! అంత ఆలోచనా నా గురించేనా! నా గురించి నేనే బాధపడటల్లేదు! నీ కెందుకంత బాధ? ఆలోచనలెక్కువైతే సుఖం తక్కువై పోతుందే! హాయిగా తిని, తిరుగు. సమస్యల్ని తేలిగ్గా తీసుకో! లోకాన్ని గూర్చి పట్టించుకోకు! నీ మనస్సుకు వచ్చిన విధంగా నడుచుకో! ఇదే జీవిత సత్యం!'' — జీవితపు పాఠాన్ని ఎంతో తేలిగ్గా చెప్తోంది.

''ఇవ్వాల్టికి ఈ పాఠం చాలు! నా కిప్పుడు క్లాసు వుంది! కొద్దిగా ప్రిపేరు కావాలి!'' అంటూ పుస్తకం చేతిలోకి తీసుకుంది కళ్యాణి.

స్వాతి ఎవరో కొత్త వ్యక్తిని చూస్తున్నట్లు కళ్యాణివేపు చూడసాగింది.

*   *   *

నాలుగు రోజులు గడిచాయి. ఈ మధ్య కాలంలో రవి ఓ నాడు వచ్చి —

''స్వాతీ! రిజిష్ట్రాఫీసులో అప్లికేషన్ పడేశాను! నిన్ను పెళ్లి చేసుకునేది ఖాయం! నువ్వు రాకపోతే నిన్ను ఎత్తుకెళ్లైనా చేసుకుంటాను'' అన్నాడు.

స్వాతి ఏం మాట్లాడలేదు.

ఆ రోజే అన్నయ్య దగ్గర్నించి వుత్తరం వచ్చింది. పెళ్లికొడుకుతో సహా ఎల్లుండి ట్రెయిన్‌లో వస్తానని వ్రాశాడు.



# ప్రేమిస్తే ఏమౌతుంది?

స్వాతి ఆ వుత్తరం చదివి ప్రక్కన పడేసింది! నిరువుగా నిట్టూర్చింది.

ఏం జీవితాలు? కోరుకున్నదెన్నడూ లభించదు! కోరుకోనిది లభిస్తుంది! జీవితాంతం బాధ పెడ్తుంది! తనకింత ప్రేమ నెందుకు చవిచూపించాలి? చివరకు అగాధంలోకి ఎందుకు తోయాలి?

దుఃఖం ఉప్పెనలా వస్తోంది. అలాగే మంచం మీద వాలిపోయింది స్వాతి.

మళ్ళీ తెల్లారి తండ్రి నిద్ర లేపుతుండగా మెలకువ వచ్చింది.

"స్వాతీ! అన్నయ్యొచ్చాడమ్మా!"

స్వాతి దిగ్గున లేచి కూర్చుంది "అప్పుడే వచ్చాడా ?"

"అప్పుడే ఏమిటమ్మా! ట్రెయిన్ ఏడింటికి వస్తుంది. ఇప్పుడు ఏడున్నర దాటింది! ఆ అబ్బాయి కూడా వచ్చాడు. త్వరగా లేచి తయారవు తల్లీ!" అన్నాడు.

స్వాతి పావుగంటలో తయారయింది. టిఫిను ప్లేట్లు పుచ్చుకుని ముందు గదిలోకి వచ్చింది.

"రా స్వాతీ! ఈమె నా చెల్లెలు స్వాతి"

స్వాతి ట్రే టేబిల్‌మీద పెట్టింది

"ఇతడు మోహన్ అని మా కంపెనీలో క్రొత్తగా చేరాడమ్మా!"

స్వాతి తలెత్తి అతనివేపు చూసి వులిక్కిపడింది. అతడిని ఎక్కడో చూసింది.

"ఇతడు మోహన్ అని నా బెస్ట్ ఫ్రెండ్ స్వాతీ!"

కళ్యాణి మాటకు అభ్యంతరం చెప్తూ — 'ఒట్టి ఫ్రెండ్‌నే కాదండోయ్! కాబోయే మొగుణ్ణి కూడా" అన్నాడు నవ్వుతూ

స్వాతి మోహన్ వేపు చూసింది. ఆనాటి సంతోషం కానీ, వుత్సాహం కానీ అతనిలో మచ్చుకైనా కన్పించడంలేదు సర్వం కోల్పోయిన వాడిలా వున్నాడు. స్వాతి వేపు చూసి నవ్వాడు. కానీ ఆ నవ్వులో ఆనాటి అందం లేదు.

"కూర్చో స్వాతీ!" అని, "తీసుకోవోయ్, మోహన్!" అంటూ ప్లేటు ఇచ్చాడు అన్నయ్య.

"మా స్వాతి ఇక్కడ కాలేజీలో వర్క్ చేస్తోంది! మంచి లెక్చరర్‌గా పేరు వుంది."

"అలాగా!"

"స్వాతీ! మోహన్ చాలా నెమ్మది ఎక్కువ మాట్లాడడు! చాలా ముభావంగా వుంటాడు."

స్వాతికి ఆ మాటలు నవ్వు తెప్పించాయి.

"స్వాతీ! మోహన్ ఒట్టి వాగుడుకాయ! మాట్లాడ్డం మొదలుపెట్టాడంటే ఫుల్‌స్టాప్, కామా వుండదు!" మోహన్ని గూర్చి కళ్యాణి చేసిన కామెంట్ అది.

అన్నయ్య టిఫిను, కాఫీ పూర్తిచేసి "మోహన్! నేను స్నానం చేసి వస్తాను మీరిద్దరూ మాట్లాడుతూ వుండండి!" అంటూ లేచివెళ్ళాడు

స్వాతి మోహన్ని గూర్చే ఆలోచిస్తోంది మోహన్ ఎందుకలా వున్నాడు? కళ్యాణి ఈమధ్య మోహన్ని గూర్చి చెప్పడంలేదు! ఎందుకనో?

"మీకిక్కడనుంచి ట్రాన్స్‌ఫరయిందా?"

మోహన్ తలెత్తి స్వాతివేపు చూశాడు

"లేదండీ! నేనే కావాలని చేయించుకున్నాను" అన్నాడు మోహన్.

"ఎందుకని?" ప్రశ్నించింది స్వాతి.

"అసలు విషయం చెప్పమంటారా!"

"చెప్పండి."

"కళ్యాణికి, నాకూ వున్న పరిచయం మీకు తెలుసు! కళ్యాణిని నేను ప్రాణాధికంగా ప్రేమించాను. కాని కళ్యాణి నేను చాలా డబ్బున్నవాడి ననుకుని నన్ను ప్రేమించినట్లు నటించింది నా అసలు జీవితం తెలీగానే నన్ను మర్చిపోయింది కాని నేను కళ్యాణిని మర్చిపోలేకపోయాను. కళ్యాణిని కలిసి ఆమెతో నా ప్రేమను చెప్పడనికి ఎంతో ప్రయత్నించాను. కానీ ఆ తర్వాత కళ్యాణి నావేపు కన్నెత్తి కూడా చూడలేదు. నేను కన్పిస్తేనే అస్సహ్యంగా ముఖం తిప్పుకునేది ఈ బాధని భరిస్తూ ఇక్కడ వుండలేక ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నానండీ!"

ఇది వారో "ప్రేమకథ" అన్నమాట!

"మీరు కళ్యాణిని ఇప్పటికీ ప్రేమిస్తున్నారా?"

"ఇప్పటికే కాదు, ఎప్పటికీ ప్రేమిస్తాను ప్రేమంటే ఒకరోజు వుండి మరునాడు పోయేది కాదండీ!" అన్నాడు కొద్దిగా బాధగా.

తనూ అటువంటి స్థితిలోనే వుంది కాబట్టి అతడిని ఎక్కువ ప్రశ్నించలేదు స్వాతి.

"మరి పెళ్ళి చూపులకెందుకు వచ్చారు?"

"పెళ్ళిచూపులకు రాలేదు! మీ అన్నయ్యగారు మీ పేరు స్వాతి అని చెప్పగానే కళ్యాణి జ్ఞాపకం వచ్చింది కళ్యాణి మీ స్నేహితురాలని తెలుసు. అసలు విషయం మీకు చెప్పి ఒక్కసారి కళ్యాణిని చూసిపోదామని వచ్చాను స్వాతిగారూ! మీరు కళ్యాణిని ఇక్కడకు తీసుకురావాలి. ప్లీజ్ నా కోసం! దూరంనుంచైనా ఒక్కసారి చూసి సంతోషిస్తాను."

కళ్యాణిమీద అతనికి గల ప్రేమకు చలించిపోయింది స్వాతి.

"మోహన్‌గారూ! కళ్యాణి చాలా మంచి పిల్లండీ! కానీ కళ్యాణి కుటుంబ పరిస్థితి దాన్ని అలా తయారుచేసింది దానికి ఎన్నో కోరికలున్నాయండీ అవి తీరాలంటే డబ్బున్న వ్యక్తి భర్తగా రావాలి అందుకే అటువంటి వ్యక్తి కోసం అన్వేషిస్తోంది మీకు డబ్బులేదని తెలీగానే మీకు దూరమైంది. అది దాని తప్పు కాదండీ! దాని పరిస్థితులటువంటివి మీలాటి వాళ్ళు సానుభూతితో అర్థం చేసుకోవాలి" అంది స్వాతి.

ఆ మాటలకు నొమ్ముకుంటూ — "నాకు కళ్యాణిమీద కోపం లేదండీ! నా దురదృష్టం మీద నాకే కోపం!" అన్నాడు మోహన్.

"కళ్యాణికి తన అన్వేషణలో మీలాటి మంచి వాళ్ళేకాక కొంతమంది చెడ్డవాళ్ళూ తారసపడవచ్చు. వాళ్ళవలన మోసం కూడా సంభవించవచ్చు. కళ్యాణి ఇప్పుడలాగే మోసపోయిందండీ."

స్వాతి మాటల్లోని భావం మోహన్‌కి అర్థమైంది

"చూడండి మోహన్‌గారూ! ఇప్పుడు కనుక కళ్యాణి మిమ్మల్ని చేసుకోమని అడిగితే మీరు చేసుకోగలరా?" స్వాతి సూటిగా ప్రశ్నించింది.

మోహన్ ముఖంలో ఆనందం తొంగిచూసింది.

అది చూసి స్వాతి—"కానీ, మోహన్‌గారూ .." అంటూ ఏదో చెప్పబోయింది.

"మీరింకేం చెప్పకండి. నా కర్థమైంది. కానీ నేను ప్రేమించింది కళ్యాణిని. నాకు కావల్సిందీ కళ్యాణే! ఆమె తప్పొప్పులతో నాకు పనిలేదు. ఆమె ఎటువంటిదైనా నేను మనస్ఫూర్తిగా ప్రేమిస్తాను" దృఢంగా అన్నాడు.

ఆ మాటల్లో కపటం గానీ, అబద్ధం కానీ కన్పడలేదు స్వాతికి. అతని ప్రేమకు ఆనందం కూడా కలిగింది.

'కళ్యాణీ! నువ్వు చాలా అదృష్టవంతురాలివి' అనుకుంది మనసులో.

"మోహన్‌గారూ! కళ్యాణికి, మీకూ పెళ్ళి జరిగేట్టు చూసే బాధ్యత నాది!"

ఆ మాటతో మోహన్ చప్పున ముందుకు వంగి స్వాతి చేతుల్ని పట్టుకుని కళ్ళకద్దుకున్నాడు.

స్వాతికి రాధ జ్ఞాపకం వచ్చింది.

"స్వాతీ! మీరు ... మీరు .. చాలా గొప్పవారండీ!" అన్నాడు మోహన్.



# ప్రశ్నావళి

-కె. రామలక్ష్మి

డి. పి — భిలాయి

మీకు జ్యోతిషం మీద నమ్మకం వుందా ?

★ ఏ పూట కాపూట మన రాత తెలిసిపోతూ వుంటే — యింకా జ్యోతిష్యం ఎందుకండీ బాబూ !

నాను, ప్రసాద్ — అండలూరు.

చాలామంది రచయితలు, నటీనటులు పొగడ్తలకి పొంగిపోమని తెగడ్తలకి కృంగిపోమని చెప్తూ వుంటారు. మీరూ అంతేనా ?

★ అంతే ! అంతేకాదు, నల్గురిమధ్య పనిచేసే వాళ్లమీద ఎప్పుడూ రాళ్ళూ, పువ్వులూ పడుతూనే వుంటాయి. ఎవరో ఏదో అన్నారని రాయడం మానేయడం ఎంత అవివేకమో, ఎవరో ఓహో ! ఆహా ! అన్నారని నిజం అనుకోడమూ - అంతే అవివేకం అని నా అభిప్రాయం.

యు. యు.— ఉరుంకుదు.

ఎంత సంపాదించినా యింకా సంపాదించాలనే తపనా, ఆరాటం ఎందుకు ? అతని కందులో తృప్తి మిగులుతుందంటారా ?

★ తన తృప్తి కోసం కాదతగాడు పడే — ఆరాటం. ముందు తరాల వారికి యింకా యింకా చేర్చి పెట్టాలన్న తపన అది. వంట చేసిన వాళ్లకి తిండి తినాలనిపించదు. సంపాదించే కొద్దీ వాళ్లకీ అంతే. సంపాదించడమే — ఛాలెంజి. థ్రిల్.

జి. జె ఆర్. — వైజాగ్

అక్కయ్యా ! మీకో జబ్బు వుంది. అదే సూటిగా సూది గుచ్చినట్టు మాట్లాడడం. అది మానుకుని అమృతాన్ని చిలికించినట్లుమాట్లాడ్డానికి ప్రయత్నించగోరుతాను ?

★ నైస నైసుగా మాట్లాడి వున్నది చెప్పక పోవడం నాకు చేతకాదు; చచ్చుగా మాట్లాడితే చచ్చుగా మాట్లాడుతున్నారని; గంగలో దిగుతూంటే గంగలో దిగబడుతున్నారని చెప్పక — యింటల్లుడిలాగ ఇచ్చకాలు చెప్పి పబ్బం గడుపుకోవడం నాకు చేతకాదు; తడిగుడ్డతో గొంతు కోయడం కంటే — వెట్టుకత్తితో ఒక్కవేటు వేయడం — ఆ జీవికి సుఖం అని నేను భావిస్తాను. ఎవరేనా నేను పొరపాటు చేశానని చెప్పడానికి ఒకటే— శాఖా చంక్రమణం చేస్తూవుంటే — ఎందుకొచ్చిన డొంక తిరుగుడు. నేనేం చేశాను! అని అడిగేస్తాను. అనుమానం నివృత్తి చేసుకుంటాను. మంచి స్నేహితులు మిగలాలంటే — సూటిగా వుండడం ఒక్కటే దారి అని నా భావన.

ఎ ఎస్. — నల్లమాడు.

కట్నం తీసుకోకూడదని ఆదర్శప్రాయంగా వుండాలని చాలామంది లెక్చర్లు గంచుతారేగాని కనీసం నూటికి ఒక్కరైనా ఆచరణలో పెడుతున్నారా ?

★ ఎందుకు పెట్టడంలేదు ? చాలామందే — ఆచరణలో తమ ఆదర్శాలని పెట్టుతున్నారు. ఎటొచ్చీ—పెట్టనివాళ్ల కొచ్చినంత పేరు- ఆచరణలో పెట్టేవారికి రాదు. ఎందుకంటే — వీరు తమ ఆదర్శాలని కప్పెక్కి అరవరు.

ఎం. బి. ఆర్ — బైపల్లి.

రమలక్ష్మిగారూ ! మీ క్వాలిఫికేషన్ ఏమిటో మాకు తెలియదండి ?

★ ఏమీ లేకపోవడమే — పెద్ద క్వాలిఫికేషన్. వరసగా అఆలు రావు. కాని రచనలు చేయకలను. ఉట్టికెగర లేకుండా వున్నాను, కాని స్వర్గం — నా టార్గెట్ !

ఆర్. ఎస్. కె. ఆర్. — కూనవరం.

ప్రేమించి పెళ్లాడిన ప్రియునిపై ఎక్కువ విధేయత కల్గివుంటుందా ? పెళ్లాడి ప్రేమించిన వానిపై ఎక్కువ విధేయత కల్గివుంటుందా ?

★ ఏ రాయి అయితేనేం ? పళ్లూడ గొట్టుకుందుకు ! అనుకుంటుందీ నాడు స్త్రీ ! కాని ఒక్కటి మాత్రం చెప్పగలను — తిండీ, బట్టా ఇచ్చి దేప్పేవాడిని కాదు స్త్రీ గౌరవించేది - తిండీ, బట్టా యిచ్చి — స్త్రీగా గౌరవించే వాడిని — ఆరాధిస్తుంది !

బి. ఏ; బి. బి. — ఆదోని.

మీ జవాబులు చదువుతూవుంటే మికు ఎంత పురుష ద్వేషమో అర్థం అవుతుంది ?

★ మీరు నన్ను చాలా పొరపాటుగా అర్థం చేసుకుంటున్నారు పురుషులపై నా కెందుకు ద్వేషం ? నేను గౌరవించేది ఎందరో పురుషులే! ఎటొచ్చీ వారు స్త్రీపై స్త్రీగా కాక వ్యక్తిగా గౌరవం కలవారు. నన్ను ఆడదానిగా కాదు—సాటి మనిషిగా గౌరవింప కలవారు వారు. ఆడది ఆడదానిగానే వుండాలను కోవడం పురుష అహంకారానికి చిహ్నం అని నా భావన. ఆడతనం ఒక లక్షణం అని ఎందుకనుకోరు మీరు ?

బి. ఎస్. ఎస్. బి. — మచిలీపట్నం.

ఏమిటి సమాధానాలు యిష్టమొచ్చినట్టు రాస్తున్నారు? అసలు మీరెలాంటి త్యాగమూర్తులు?

★ చెప్పాలనేవుంది — కాని చేసిన త్యాగాలు చెప్పడం నాగరికతకాదని వూరుకుంటున్నానయ్యా ! అయినా ఒకటి — నీ పూర్తి లేఖకు సమాధానం ఇవ్వకుండా వుండడం కూడా నా త్యాగశీలతను చాటి చెప్తుందని గ్రహిస్తే అదే పదివేలు !! ★

---

స్వాతికి తన పరిస్థితి జ్ఞాపకం వచ్చి కళ్లల్లో నీళ్ళు తిరిగ యి !

పేలవంగా నవ్వుకుంటూ — ''మోహన్‌గారూ! గొప్పదాన్ని కాదండీ ! మీకు తెలీదు, నేను చాలా దురదృష్టవంతురాల్ని'' అని అనుకుంది మనసులో.

* * *

సాయంత్రం అరయింది. మోహన్, అన్నయ్య షికారు వెళ్లారు. స్వాతి వరండాలో కుర్చీ వేసుకుని కూర్చుంది. పడమటి కొండమీద ఎవరో శవాన్ని కాలుస్తున్నంత ఎర్రగా వుంది. ఆ ఎర్రని మంటల్లో పడి తన ప్రేమ, కోరికలు, ఆశలు అన్నీ కాలి పోతున్నట్లనిపించింది. ఈ ఆరునెలల్లోనే ఎన్నో అనుభవించింది.

ప్రేమించింది !

విరహ పడింది !

అసూయ, ద్వేషం !

ఆ తర్వాత — త్యాగం ! అన్నీ అనుభవానికి వచ్చాయి.

మనుషుల్ని దగ్గిరికి చేర్చి, వారి మధ్య అనుబంధాల్ని ఏర్పరచి, తిరిగి వారిని విడదీయడం భగవంతుని కిష్టమేమో ! రవి పరిచయంతో తన అన్వేషణ ముగిసిందని సంతోషపడింది. తన జీవితానికి సరైనతోడు లభించిందని పొంగిపోయింది! కాని చివరికి ఏమయింది ! రవిని వదులుకోవాల్సి వచ్చింది.

పోనీ వివాహం చేసుకుని జీవితంతో రాజీ పడదామనుకుంటే, అదీ సాధ్యపడలేదు! ఒక్కొక్కళ్ల జీవితాలింతే !

'రవి ఈ పాటికి ఏం చేస్తుంటాడో ?'

వెంటనే తనని తాను నిందించుకుంది స్వాతి.

ఛ ! ఏమిటిది ? ఇక రవిని తలుచుకో కూడదు ! ఈ జ్ఞాపకాల్ని, ఈ మనుషుల్ని ఈ వాతావరణాన్ని — మర్చిపోవాలి ! పూర్తిగా మర్చిపోవాలి !

కాని, ఇక్కడ వుంటే మాత్రం అది సాధ్యం కాదు ! ఇక్కడినుంచి వెళ్లిపోవాలి ! కాని, ఎక్కడికి వెళ్లాలి ?

స్వాతికి హఠాత్తుగా గుర్తుకు వచ్చింది, మధ్యాహ్నం ప్రిన్సిపాల్ పిలిచి చెప్పిన విషయం —

''స్వాతీ ! గల్ఫ్ కంట్రీస్‌లో ట్రెయిన్డ్ టీచర్స్ కావాలిట ! ఎడ్వర్టయిజు చేశారు ! నాకు తెల్సినొకాయన 'మీ కాలేజీనుండి ఎవర్నైనా పంపించండి' అనడిగితే నాకు నువ్వు జ్ఞాపకం వచ్చావు. స్వాతీ ! నువ్వు వెడతావా ? అక్కడ మూడేళ్లు వుండాల్సి వుంటుంది. మూడేళ్లు అయ్యాక నువ్వు కావాలంటే అక్కడ వుండొచ్చు. లేకపోతే తిరిగి వచ్చేయచ్చు. ఒంటరిగానా అనే భయం అక్కర్లేదు. నీతోపాటు ఇంకా అమ్మాయిలు వుంటారు. అక్కడ నీకే విధమైన కష్టమూ రాదు. ఆ హామీ నేనిస్తాను. ఆలోచించి నాకు ఏ సంగతి రెండ్రోజుల్లో చెప్పాలి ! మంచి అవకాశం. నువ్వు ఉపయోగించుకుంటే బాగుంటుందని నా వుద్దేశం. నీ కిష్టం లేకపోతే ఇంకెవరి పేరైనా సజెస్ట్ చేస్తాను ! ఆలోచించు !''

ఆలోచిస్తోంది !

ఇంకా ఆలోచిస్తోంది !

ప్రస్తుతం వున్న పరిస్థితుల్లో తనకు మార్పు అవసరం !

తను కనుమరుగయితే రవీ, రాధా దగ్గర కావచ్చు !

ఇదీ ఒకందుకు తన మంచికే వచ్చింది !

నాన్నగారిని ఒప్పించి వెళ్లాలి !

నాన్నగారు తన మాట కాదనరు !

కొన్నాళ్లపాటు ఈ వాతావరణానికి దూరంగా వెళ్లాలి !

అవును ! వెడతాను !

స్వాతి మనస్సు తేలికయింది.

(అయిపోయింది)

# మనిషికి ఐసోటోపుల సేవ

—సి. వి. సర్వేశ్వరశర్మ—

పరమాణు శక్తిని రేడియో ఐసోటోపుల సహాయంతో శాంతియుత ప్రయోజనాలకు ఉపయోగించవచ్చును.

ప్రతీ మూలకం పరమాణువులతో నిర్మితమై ఉంటుంది. ఒకే మూలకంలోని పరమాణువులు రసాయనికంగా ఒకే ధర్మాలు కల్గివున్నా వేరు వేరు బరువులు కల్గివుంటే వాటిని ఐసోటోపులు అంటారు. కొన్ని ఐసోటోపులు రేడియో ధార్మికధర్మం కల్గి ఉంటాయి. వాటినిరేడియో ఐసోటోపులు అంటారు. ఇవి చాలా అస్థిరత కల్గి ఉంటాయి. చాలా హెచ్చు వేగం గల గామా కిరణాలను విడుదలచేసి కొత్త మూలకపు పరమాణువులుగా మారిపోతాయి.

రేడియో ఐసోటోపుల్లో వుండే పరమాణువుల సంఖ్యనుబట్టి అది కొత్త పదార్థముగా విఘటనం చెందే స్వభావంలో హెచ్చు తగ్గులు ఉంటాయి. పదార్థమందలి పరమాణువుల సంఖ్య తగ్గే కొలది విఘటనపు రేటు తగ్గిపోతుంది. ఈ విఘటనపు రేటుపై ఉష్ణోగ్రత, పీడనము లేదా మరి ఏ ఇతర అంశముల ప్రభావము ఉండదు. ఐసోటోపుకు అర్థాయుష్షు ముఖ్య లక్షణం. అంటే ఐసోటోపులో ముందుగా ఉన్న పరమాణువుల సంఖ్య ఎంత కాలంలో సగం పరమాణువులుగా విఘటనం చెంద బడ్డాయి అని తెలుపుతుంది అర్థాయుష్షు. కాని ఐసోటోపునుబట్టి ఈ అర్థాయుష్షు మారుతూ సెకను మొదలు కొన్ని మిలియన్ల సంవత్సరాల వరకూ ఉంటుంది.

ఈ రేడియో ఐసోటోపులు కొత్త మూలకపు పరమాణువులుగా మారేప్పుడు మూడు రకాలయిన కిరణాలు విడుదలచేస్తాయి. అవి ఆల్ఫా కిరణాలు, బీటా కిరణాలు, గామా కిరణాలు.

ఈ రేడియో ఐసోటోపులు పైన చెప్పిన మూడు తరగతుల వికిరణాలను ఒక క్రమపద్ధతిలో తగినంత సమయం నిర్విరామంగా అయత్న ప్రయత్నంగా వెలువడే స్వభావం కల్గి ఉండడంవల్ల అవి ఎంతో ఉపయోగంగా ఉన్నాయి.

ఈ రేడియో ఐసోటోపులు వైద్యరంగంలో, వ్యవసాయరంగంలో, పారిశ్రామిక రంగంలో, పరిశోధనారంగంలోను, తదితర రంగాలలోను ఎంతగానో ఉపయోగపడతాయి.

రోగనిర్ణయానికి, రోగచికిత్సకు రేడియో ఐసోటోపులు వినియోగిస్తున్నారు. శరీరంలో ఏ భాగంలోనైనా కంతి లేదా అవయవానికి ఈ రేడియో ఐసోటోపును ఇచ్చి ఒక "కౌంటరు" సహాయంతో ఆ అవయవం లేదా కంతి ఎంతటి రేడియో ధార్మికత పొందగల్గింది తెలుసుకొని చికిత్స చేస్తున్నారు. ఉదాహరణకు థైరాయిడ్ గ్రంధికి రేడియో ఐయోడిన్ - 131 ఇచ్చి దానిని కౌంటరుకు కలిపి ఈ గ్రంధి ఏ రకమయిన అనారోగ్యానికి లోనయిందో తెలుసుకోవచ్చును. వ్యాధి చికిత్స తగినంత అర్థాయుష్షుగల కృత్రిమ రేడియో ధార్మిక పదార్థము తీసుకుని చేస్తున్నారు. ఈ చికిత్సకు నీరుగాని, విద్యుత్‌గాని అవసరం ఉండదు.

వ్యవసాయరంగంలో ఈ ఐసోటోపుల ఉపయోగం నిజంగా అపూర్వంగా ఉంది. పంట పండేకాలం తగ్గడమేగాకుండా చక్కటి నాణ్యతగల ధాన్యము ఎక్కువ పండడం, క్రిమికీటకాదులు, పశుపక్ష్యాదులు పంటలజోలికి రాలేకుండా చేయడం ఈ రేడియో ఐసోటోపుల విశేషం. ఈ ఐసోటోపు విడుదలచేసే గామాకిరణాలు ఎక్కువసేపు మానవుల మీదగాని తదితర చలించే ప్రాణులమీదగాని పడితే వాటికి మరణం సంభవిస్తుంది అయితే పొలాల్లో కార్మికులు పనులు చేసుకునేటప్పుడు ఈ రేడియో ఐసోటోపును పెద్దసీసపు దిమ్మలోకి దింపేస్తారు.

పారిశ్రామికంగా ఈ రేడియో ఐసోటోపులు ఎంతో విలువైన పనులను చేయగల్గుతున్నాయి. ఏదైనా లోహపు పలకమీద ఎంతమందముగా జింకు, లేదా తగరపుపూత ఏర్పడిందో ఖచ్చితంగా ఈ ఐసోటోపులవలన కనుగొంటున్నారు దీనివలన పదార్థం వ్యర్థం కాకుండా తగినంతగానే ఉపయోగ పడుతోంది.

మిల్లులలో బట్టను సింధటిక్ ధారాలతో నేసేటప్పుడు రాపిడికి ఈ దారాలపై విద్యుదావేశం పోగుబడి ఫలితంగా దుమ్మును ఆకర్షించడంవల్ల మురికిగా బట్టతయారై [ముఖ్యంగా రాత్రి సమయాల్లో] అసౌకర్యం ఏర్పడుతుంది ఈ ఇబ్బందిని రేడియో ఐసోటోపులు విడుదలచేసే 'బీటా' కిరణాలను బట్టలపై ప్రయోగించడంవల్ల విద్యుదావేశం తొలగించబడుతుంది. ఈ విధంగా ప్లాస్టిక్ పదార్థాలు తయారుచేసేచోట కూడా ఉపయోగిస్తున్నారు. అయితే పద్ధతిలో కొంచెం మార్పు ఉంటుంది.

ముఖ్యంగా రసాయనిక శాస్త్రంలో చాలా ఉపయోగంగా ఉన్నాయి. జంతు అవశేషాలు దొరికితే ఈ ఐసోటోపుల సహాయంతో ఎన్ని సంవత్సరాల ముందు ఆ జంతువు సజీవంగా ఉండేది తెలుసుకోవచ్చు.

ఇతరరంగాల్లో అంటే ధాన్యాలు పాడవకుండా నిల్వఉండేందుకు, పెన్సిలిన్ తదితర ఆంటీ బయాటిక్సు తక్కువ ఉష్ణోగ్రతవద్దనే స్టెరిలైజ్ చేసేందుకు ఎంతగానో ఉపయోగపడుతున్నాయి మనిషికి యివిచేసే సేవలపారం.







అధిక దిగుబడి ప్రతి పైరునుండి ప్రతి సారి పొందాలంటె మీ భూమిలో సారం అధికంగా ఉన్నప్పుడు మాత్రమే సాధ్యమవుతుంది.

మీ భూసారం అధిక స్థాయిలో ఉండేందుకు ఈ క్రింది పద్ధతులు అవలంభించండి.

1. సిఫార్సు ప్రకారం నత్రజని, భాస్వరం, పొటాసియంలను విజయ్ ఎరువుల ద్వారా అందించండి.

మోతాదు (ఎకరాకు కిలోలలో)

| పైరు | దుక్కిలో విజయ్ 24-24-0 | పైరుపై విజయ్ యూరియా |
|---|---|---|
| వరి (చిత్తూరు, అనంతపూర్ జిల్లాలు మినహా) | | |
| అధిక దిగుబడి రకాలు | 100 | 50 |
| దేశవాళి రకాలు | 50 | 25 |
| చెఱకు | | |
| కోస్తా, రాయలసీమ | 50 | 135 |
| తెలంగాణ ఎక్సాలి | 50 | 200 |
| తెలంగాణ అడ్సాలి | 50 | 325 |

2. అధిక దిగుబడులకు విజయ్ ఎరువులను సరిఅయిన సమయానికి సరిఅయిన పద్ధతిలో వేయండి.
3. పసువుల పెంట, చెత్త చెదారాలను భద్రపరచిపోలంలో కలియ దున్నండి.

ఇంకా వివరాలు కావలిస్తే ఈ క్రింది చిరునామా నుండి పుస్తకాలు తెప్పించుకొని తెలుసుకోండి.




ఏరియా మేనేజర్
మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్
4,4, కాంతినగర్.
హైదరాబాదు-500 028

నాణ్యమైన, నమ్మకమైన విజయ్ ఎరువులను తయారుచేయువారు
**మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్**
మణలి, మద్రాస్ 600 068

**మీ పిల్లలకు అవసరం పుష్టికరమైన ఆహారం**
**మీ పైర్లకు అవసరం**
**విజయ్**






MFL-2259




పుచ్చపువ్వులా కాసే పండు వెన్నెల్లో కృష్ణవేణీ నదీతరంగాలు అమరేశ్వరస్తోత్రం చేస్తున్నాయి. ఆ పాలవెన్నెల ధగధగలలో అమరేశ్వరాలయం ధవళేశ్వరాలయమై ఒప్పుతోంది.

అయితే అమరావతి రాజభవనోపరిభాగాన రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు వికల మనస్కుడై అటూ ఇటూ తిరుగుతున్నాడు. మాత్సర్యం గాలమై మనోమత్స్య గ్రహణం చేస్తోంటే ఆయన విలవిల్లాడి పోతున్నాడు ఆలయగోపుర సందర్శనం కూడా ఆయనలో శాంతిని సంస్థాపించలేక పోతోంది.

"పరదేశి గ్రామ సమీప వర్తియైన ఒక పాళెగాడు!" ఇవే పదాలు ఈటె పోటుల్లా ఆయన గుండెలోతుల్లో పదే పదే గుచ్చు కుంటున్నాయి

ఎంత నిర్లక్ష్యం! ఎంత అవహేళన! ఎంతటి అవమానం! శతాధిక శివాలయ ప్రతిష్ఠాపన తత్పరుడైన తన కీర్తి నేటికి ఈ బందా పరదేశి వల్ల డిందుపడిందే!

ఎవరీ పరదేశి ?

తన రాజ్యంలో ఒక సామాన్య మానవుడు!

తను దయదలచి ఇచ్చే ధన ధాన్యాదులను దానంచేసే దానవుడు!

అట్టివాని పేరా ఆసేతు హిమాచలం మార్మోగడం!

"పరదేశి గ్రామ సమీప వర్తియైన ఒక పాళెగాడు!" కాశీ మహారాజా ఆ మాటను ఎంత చులకనగా అనగలిగాడు! కాశీయాత్రకు తానేల పోవలె? ఇంతమాట ఏల రావలె! పరదేశి పేరు ప్రతిష్ఠలతో ముడిపడి ఉందా ఈ మన్నె సుల్తాన్ పరువు!

అమరేశ్వర కరుణా పాత్రుడై, సాటి జమీందారులలో మేటియై వన్నెకెక్కి యుక్కుమిగిలే ఈ వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడు కాసుకు కొరగాని దాసుని పేరుతో తెలియబడటమా!

ఎంతటి అవమతి!

# పరదేశి

అటు నిజాం, ఇటు ఆంగ్లేయుల ఉక్కు చట్రాలలో ఉండి కూడా దివ్య దీప్తులు విరజిమ్మే తన కీర్తి చంద్రికలకు పరదేశి అనే ఈ మబ్బుతునక అడ్డమా ! ? .

కాదు. కాదు; ఇది మబ్బుతునక కాదు.

తన దుష్కీర్తి రాహు ముఖమున వాసిరెడ్డి సుకీర్తి చంద్రుని కబళింప సాహసిస్తున్నాడు ఈ పరదేశి ! రాజనీతి దృష్ట్యా ఇది సహింపరానిది.

అయినా రాజు తలిస్తే దెబ్బలకు కొదవా?

ఎప్పుడూ ప్రశాంతంగా ఉండే వేంకటాద్రి నాయిడి వదనంపై ఇప్పుడు సంతాపం దోబూచులాడుతోంది.

కృష్ణా పగలాగా పొంగిపొర్లే పగను ఆపుకోలేక పోతున్నాడు. ఏదో గట్టి నిర్ణయమే తీసుకున్నాడు.

*   *   *

'హతవిధీ! యాచకుల పాలిటి మురగొంగు పసిడి, అవతార పురుషుడు, నిరుపమాన శివభక్తుడు, నిరంతర ప్రజా రక్షణ శీలుడూ అయిన వాసిరెడ్డి వేంకటాద్రి ప్రభుడు అకారణంగా నిర్దోషి అయిన తనపై ఈసు వహించడం శివలీల కాక మరేమిటి ? రాజు గారికి వెఱచి ఊరివారు కూడా తనకు తోడ్పడటం మానివేశారే ! రాజు తలిస్తే దెబ్బలకు కొదవా !!'

చింతా తరంగాలలో తలమునకలవుతున్నాడు పరదేశి.

పచ్చి పసుపు కొమ్ము లాంటి పెద్ద ముత్తయిదువ చాలా సేపటి నుండీ భర్తనే చూస్తూ తుదకు విధిలేక నోరు విప్పింది.

"రేపటి సంగతి ఏం ఆలోచించారు ?"

"రేపటి కోపలేమా ?"

"గింజ లేదు "

"అమ్మటాని కింకేమైనా..."

"మన నిరతాన్నదాన వ్రతాగ్నికి సమిధలై పొలమూ పుట్రా, నగా నట్రా అన్నీ సంపూర్ణాహుతై పోయాయి."

పరదేశి తల పంకించాడు. "పాపం, ఈ ప్రొద్దుట వచ్చిన అతిథుల భోజన సౌకర్యాలకై నీ తాళిబొట్టు కూడా తెగనమ్మవలసి వచ్చింది."

"మనుష్యుల మనస్సులు మార్చే బంగారం కన్న, తన రంగుతో మన బ్రతుకులకు శుభశోభలను కలిగించే పవిత్రమైన ఈ పసుపు కొమ్మే పదివేలు." గర్వంగా పలికింది భార్య.

"అయితే రేపు మనకు పస్తేనంటావా!"

"మన సంగతి అలా వుంచండి. రాబోయే అతిథుల ఆకలి తీర్చడానికి యింత కలి గూడా ఉండదు "

"శివశివా!" చెవులు మూసుకున్నాడు పరదేశి. "ఎంత మాట! పరదేశి యింటికి వచ్చిన అతిథి ఆకలితో వెళ్లిపోవటమా ! మానవులు, దేవతలు ఏకమై కుట్రచేసినా, నా బొందిలో ప్రాణం వుండగా అలా జరగదు. అమ్మకానికి ఏ చిన్న వస్తువైనా మిగిలి వుందేమో చూడు ఇంట్లో."

"ఇంటిలో ఏమీలేదు, మన ఒంటిమీద కట్టు బట్టలు తప్ప. చివరకు కంచాలతో సహా అమ్మివేసిన సంగతి మీకు తెలుసుగదా!"

పరదేశి కడుపులో దేవినట్లయింది.

"ఆకలిగొన్న వారికి అన్నం పెట్టే పరదేశి పైనా ప్రపంచానికింత ప్రచండ వైరం ! ఒదిగి ఒదిగి వుండే వానిపైనా ఈ పల్లె వాళ్ళ కుళ్ళు ! సోమం తప్ప ఇతరమెరుగని వానిపైనా ఈ గ్రామం వారి సన్యాగమం ! నేను వీళ్ళనేం చేశానో తెలియడంలేదు."

"ఇలా విచారించి ఫలితమేమిటి ? తిండి గొడవ చూడండి. ప్రొద్దుటి నుండి మీ కడుపులో మెతుకు లేదు. ఉన్నది కాస్తా ఆ తిరుపతి యాత్రికునికే సరిపోయింది."

"నీ సంగతేమిటి ? నిన్నటి నుండి నీ వొక మెతుకైనా గతకలేదని నీ క్షీణస్వరం చెప్పకచెబుతూంది."

"నా సంగతి అలావుంచి రేపటి సంగతి ఆలోచించండి."

పరదేశి నిట్టూర్చాడు.

"చివరికి పరదేశికి రేపు ఎదురైంది. చిల్లిగవ్వకూడా గలగల్లాడక ఇల్లు మూగబోతూంది. క్షుదార్తనాదాలకు బధిరుణ్ణి కావాలి రేపు. అట్టి రేపు రాకుంటే ఎంత బావుణ్ణు."

"ఎంతమాట ! ఇంత చక్కని సృష్టికి రేపు లేకపోవడమా ?"

"నాకు తెలుసు, నీ విశాల హృదయం నుండి వెలువడబోయే వేదవాక్కులు. కాని అతిథుల క్షుత్తు చూచి మిన్నకుండటం కన్న మిత్తి మరిలేదు మనకు. ఈ రాత్రే ఎటైనా వెళ్లిపోదాం. ఈ ఊరి సూర్యుడు రేపటి మన దుస్థితిని చూడరాదు "

భార్య నివ్వెఱపడింది. "ఊరు విడచి పోవడమా!"

పరదేశి గొంతు గద్గదమై పోయింది. "అవును. బందా వంశ కలశాంబుధి పూర్ణ చంద్రులు తమ కీర్తి చంద్రికలను వెదజల్లిన ఊరు, కాశీ రామేశ్వర యాత్రికుల క్షుత్తు బాపిన ఊరు, చిన్ననాటి స్నేహితులతో ఆడి పాడిన ఊరు, ఇన్నాళ్ళూ కాపురం చేసిన ఊరు– ఈ ఊరిని శాశ్వతంగా వదిలివేసి ఈ రాత్రే ఈ క్షణమే వెళ్ళిపోవాలి."

"అత్త మామలప్పగించి పోయిన ఇల్లు దీపం పెట్టే దిక్కు లేకుండా పోతుందా !" భార్య వాపోయింది

"వర్తమాన బాధా(వణాన్ని గతస్మృతుల కంటకాలతో కెలకకు. తలచిన కొద్దీ కుమిలి కుమిలి పోవలసి వస్తుంది. మూటాముల్లె సర్దు. నడిరేయికి ముందే నట్టడివిని దాటాలి." పరదేశి స్వరంలో నిశ్చయం ధ్వనించింది.

"సర్దటానికి తగిన సామానేమీ లేదు."

"అయితే మరీ మంచిది. పద."

ఇంటి తలుపులు మూశారు దంపతులు. ఆకలితో నకనకలాడుతూ 'అమ్మా' అని అల్లాడే వారి బాధలు ఆ ఇల్లు చూడకుండా దాని కళ్లు మూశారు. ఆ ఇంటితోనూ, ఆ ఊరితోనూ ఋణం తీరినట్లు భావించారు.

ఆ రాత్రివేళ మబ్బు క్రమ్మి చీకటిగా వుంది.

వారి సుఖ హిమకరుణ్ణి లేమి మొయిళ్ళు కప్పేశాయి.

ఇక కష్టవర్ష ధారలో నానిపోవడమే తరవాయి.

*　　*　　*

కుండపోతగా కురుస్తోంది వాన.

పరదేశి పేరు నేటికి సార్థకమయింది.

ఆ పొరుగూరి సత్రంలో ఓ మూల పరదేశీ, అతని భార్యా ఒదుక్కుని కూచున్నారు.

"హమ్మయ్య! వర్షం ప్రారంభం కాక ముందే ఈ వూరి సత్రం చేరగలిగాము... చూడెలా కుండపోతగా కురుస్తోందో! మిన్నేరు మజిలీలు వెయ్యకుండానే మున్నీటిలో దుముకుతున్నట్లుంది" అన్నాడు పరదేశి.

"కాదు. మిన్ను మన్నీల జాలి కన్నీరు" అంది భార్య. వదలి వచ్చిన తమ ఇల్లు ఇంత పెద్ద వర్షంలో ఎలా ఉందో అన్నదే ఆమె ఆవేదన.

"జాలా ! మనల్ని చూసి జాలిపడవలసిన పనేముంది? జీవనమెల్లా దాన ధర్మాలతో పావనమైన మనల్ని చూసి జాలిపడాలా ? ఇక ఇప్పుడీ సత్రంలో తల దాచుకోవడమంటావా? ఇట్టి అనుభవాలు లేని భవం నిరర్థకం గదా !"

"వాన హోరుకు (పేవుల రావాలు విట్లాగూ వినబడవు. నడచి నడచి అలసి సొలసిన శరీరానికి కాస్త విశ్రాంతినియ్యండి."

"అట్లాగే" అంటూ సత్రం అంతా పొరజూశాడు పరదేశి. "మనవూరి సత్రంకన్న ఈవూరి సత్రమే విశాలంగా, సౌకర్యంగా వుంది. కాస్త విశ్రమించు. తెల్లవారకముందే ఈ వూరు వదలి పోవాలి."

దంపతుల్లో ఎవరికీ నిద్రపట్టలేదు. తమ యింటి చూరు చినుకులే గుర్తొస్తున్నాయి ఆమెకి.

కాస్సేపటికి వానజోరు తగ్గింది.

ఆ సత్రంలోనే మరోమూల క్షుధార్తులైన బిడ్డల్ని తల్లి సముదాయించడం వినవచ్చింది.

"అమ్మా! తమ్ముడేధో పెదాలు కదిలిస్తున్నాడు చూడమ్మా!" పెద్దవాడు.

"అమ్మా! కడుపులో కాళ్లు ఎంతగా కుదించి పడుకున్నా ఆకలి తగ్గడం లేదే !" రెండోవాడు.

"కళ్లు తిరుగుతున్నాయో, భూమితిరుగుతూందో తెలియడం లేదే!" మూడోవాడు.

కన్నతల్లి కంఠస్వరంలో మాత్రం దుఃఖం కంటే అపారమైన ఆత్మ విశ్వాసం తొణికిసలాడింది.

"బాబ్బాబు! ఈ రాత్రికి ఆనుకోండి. వాన తగ్గగానే వెళ్దాం. ప్రక్కదే పరదేశిగారి ఊరు. ఇదిగో. ఈ అటుకులు నమిలి పడుకోండి ఇప్పటికి."

"(పేగుల్ని మాడ్చిన మంట ఆరిపోయిందే. ఆకలి చచ్చింది. నా కొద్దే. తమ్ముళ్లకియ్యి" అన్నాడు పెద్దాడు.

"నా తండ్రికదూ. కాస్త ఓంగిలి పడు." (బతిమాలింది అమ్మ.

"అమ్మా ! మరి నీకో! ?" అడిగాడు రెండోవాడు.

"నేను తిన్నా నాన్నా !"

"మమ్మల్ని గమ్మత్తు చేస్తున్నావులే. పొద్దుటి నుంచి ఈ అటుకులు కూడా నువ్వు ముట్టలేదుగా ! ?" అన్నాడు మూడోవాడు.

అమ్మ మాట్లాడలేదు.

"ఈ ఊళ్లో ఒకరుకూడా మనల్ని ఆదరించలేదు కదా! పొరుగూరి పరదేశి మాత్రం ఆదరిస్తాడా, అమ్మా !?" అని సందేహం వెలిబుచ్చాడు పెద్దాడు.

"పసివాడివి, పరదేశిగారి సంగతి నీకేం తెలుసు ? ఆర్తులాయనకు ఆప్తులు. అజాతశత్రువనే ప్రజావాణికి ఆకలి అడ్డువచ్చింది. పరదేశిగారి పేరు ప్రఖ్యాతులు పరదేశాలకు కూడా వ్యాపించాయి."

"అంతటి ధనవంతుడా, అమ్మా !?"

"దానం చేయడానికి ధనవంతుడు కానక్కర్లేదు. ఆయన చేతికెముక లేదు. తాను త్రాగే గంజి అయినా పోసి ఎదుటి వారి ఆకలి చల్లారుస్తాడు ఆయన."

"అమ్మా ! ఆకలి తగ్గలేదే !" అటుకులు తిన్న చిన్నాడు అల్లాడాడు

"ఎలాగో ఈ రాత్రి ఓర్చుకోండి బాబూ! తెల్లవారగానే లేచి పరదేశిగారి ఊరికి వెళ్దాం. అతిథుల కోసం వేయికళ్లతో కాచుకుని వుంటారు ఆయనా, ఆయన భార్యా."


ఇకనుంచి రోజుకొక్క సిగరెట్టే కాల్చుమన్నార్ట - డాక్టరు

ఇక ఆపైన పిల్లలెవ్వరూ కిమ్మనలేదు. కాస్సేపటికి మగతనిద్ర వారిని ఆవహించింది.

మళ్లీ వాన జోరు హెచ్చింది. హోరుగాలి కూడా మొదలైంది.

"విన్నారా !?" అంది పరదేశి భార్య.

"విన్నాను. గుండెల్ని జల్లించే ఆ గోడు స్పష్టంగా విన్నాను. కాని ఏం చెయ్య గలను ? వారు తినజాలని రక్తమాంసాలు మాత్రమే మిగిలివున్నాయి నా దగ్గర."

పరదేశి భార్య నుదురు బాదుకుంది. "భగవంతుడా ! చివరకు ఎట్టి నిస్సహాయ స్థితిలో ఇరికించావు మమ్మల్ని ! అన్నదానానికి అలవాటుపడిన చేయి అల్లలాడుతోంది. చేతములో ఉన్నది చేతిలో లేకపోయింది"

"పాపం ! వసివాడిన పసిప్రాణాలకు శోష వచ్చినట్లుంది. నిద్రాదేవి ఒడిలో ముడుక్కున్నారు."

"కన్నతల్లికన్న మిన్న ఈ సువిశాల విశ్వంలో ఎవరున్నారు ! అలముకొనే విషాదాన్ని అదిమిపెట్టి పిల్లల్ని జోకొట్టింది. ఇప్పుడు నిద్రను ఆసరాచేసికొని ఆమె ముఖం విషణ్ణతను పులుముకుంటూంది."

"ఎల్లెడలాచలి. కాని వీరి కడుపులో మంటలు. ధారుణి అంతటా వర్షధారలు. కాని వీరి ఉదరాల్లో ధారకంలేదు"

"దేవుడు చలికి గాఢంగా నిద్రిస్తున్నాడు" పరదేశి భార్య స్వరంలో కోపం ప్రస్ఫుటమైంది.

"కడబట్టిన ప్రాణాలతో వీళ్లు రేపు మన ఊరి వరకూ నడిచి పోతారు. పరదేశి మూసి పోగా బోసిపోయిన ఇల్లు చూసి ఏమవుతారో?" పరదేశి చింతించాడు.

# ప ర దే శి

"ఆశలడియాస లవుతాయి కొడిగట్టిన దీపాలారిపోతాయి."

"ఇసుమంత కూడా సహాయం చేయలేని మనం పర్యవసానాన్ని గురించి యోచించి కృశించడం అనవసరం" సరిపెట్టుకొవడానికి ప్రయత్నించాడు పరదేశి.

"అంతేనంటారా!? ఏదో ఉపాయం ఆలోచించండి. వీళ్ల ఉసురు తగిలేది మనకే."

"విపరీతమైన విధిని ఆలోచనలతో ఎదుర్కోగలమా? ఊరుకో."

"మనసుంటే మార్గం ఉండక పోదు."

"పస్తులతో చస్తూ పరాంయ్యే మనకో మనస్సూ, మార్గమూ నా !"

నూత్న చైతన్యం ప్రవేశించింది పరదేశి భార్యలో. "అంత దిగజారి పోకండి. నా కోటి తోస్తూంది... మన యింట్లో ఒక పెద్ద రోలుంది."

"అవును. తాతలనాటి రోలు అది" అన్నాడు పరదేశి.

"అంత పెద్ద రోలును ఒక వరహా కయినా కొనకపోరు."

పరదేశి ఎగిరి గంతేశాడు. "భేష్! నీబుద్ధే బుద్ధి! నాకు మాంచి తరుణోపాయం చూపించావు అది వీళ్ల ఆకలికి అక్కరకు వస్తుంది."

"పదండి తెల్లవారకముందే మన ఊరు చేరాలి" లేచి నుంచుందామె.

"వాన ఇంకా తగ్గలేదే!"

"వాన తగ్గేలోగా విధి ఎన్ని అవాంతరాలు కల్పిస్తుందో మన దీక్షకు! క్షణం ఆలసించ వద్దు. పదండి. తడిసినకొద్దీ దీక్షా వృక్షం మరింత ఫలిస్తుంది."

"ఇల్లాలు తోడైతే దేవునితోసహా ఎల్లరినీ జయించవచ్చు. రా పోదాం."

ఇద్దరూ హుటాహుటి తమ ఊరికి బయల్దేరారు.

*　　*　　*

తూరుపురేఖలు పూర్తిగ విచ్చిపోయాయి. వాన వెలిసిన వినీలాకాశం స్వచ్ఛంగా ఆహ్లాదకరంగా వుంది. బాల భానుడు తన బోసి నవ్వులను ఈ సుందర విశ్వంపై చిలకరిస్తున్నాడు.

"ఏమేవ్! మవ్వు విస్తళ్లు కుట్టడం త్వరగా మొదలెట్టు. నేను రోలు పెల్లగిస్తాను" అన్నాడు పరదేశి

"మీదే ఆలస్యం" అంది భార్య ఆకులు ముందు వేసుకుని.

నడుం బిగించి రోలు పెల్లగించడం ప్రారంభించాడు పరదేశి.

ఋణశేషం ఆ తాతలనాటి పాత రోలు. తరాలనాటి అనుబంధం తెలిగ్గా తెగిడంలేదు. చాలా లోతుగా పాతినట్లున్నారు

ప్రకృతిలో జడములు కూడా మమకారాన్ని కల్పించుకుని ఆ పాశానికి కట్టుబడి ఉంటాయి.

ఎట్లానైతేనేం, పెకలివచ్చింది.

ఆ! ఏమిటది! అడుగున ఏదో శ్రావ్యంగా మ్రోగుతోందే !

లోకంలో ప్రతిదీ మట్టిలోంచి రావలసిందే!

నలుపులో పసుపు కనబడి, పరదేశి కళ్లు తళుక్కున మెరిశాయి.

"ఏమేవ్! ఇలారా!" గావుకేక పెట్టాడు.

"ఏమిటండీ, విషయ వాసనలు సంతోషాన్ని విరజిమ్ముతున్నట్లుందే!"

"వైరాగ్యానికి కాలి బందెలే! లంకె బిందెలు !"

ఒక్కపరుగున వొచ్చిపడింది పరదేశిభార్య. ఆమె కులుకు పుక్కిలింతలైంది. నిక్షేపానికి భక్తిశ్రద్ధలతో మ్రొక్కింది.

"అదృష్టాన్ని వెలికి తియ్యండి."

వరహాలు !మొహిరీలు !

పేరుకున్న భాగ్యం పగటు చూపుతోంది. ఇతోధికమైన ఈవికై భూమినుండి చెలువపు బంగారం చెలమ ఊరుతోంది.

"ఈ పైడిపంట మన అన్నదాన కృషి ఫలితం !" అన్నాడు పరదేశి.

"క్షణం క్రింద నిరుపేదలం మట్టిలో



## పరదేశి

పుట్టిన మహాలక్ష్మి మళ్లీ మన నట్టిల్లు మెట్టింది. నా అరచేయి అన్నపూర్ణం కాబోతూంది. ఇక కనకధారలతో ఆకలి మంటలు ఆరిపోతాయి.'' పరదేశి భార్య పరవశించి పోసాగింది.

''పరమశివుని కరుణా కటాక్షమే ఈ నిక్షేపం. చిన్నమెత్తు పైడి లేని మనవీడు ఒక్కసారిగా పొన్నూరైంది.'' శివభక్తి పారమ్యంతో కన్నులు మోడ్చాడు పరదేశి.

ఇంటి బయట అలబలం వినిపించి ఆ వైపు దృష్టి సారించింది అతని ఇల్లాలు. ''అరుగో! మాటల్లోనే ఆ తల్లీ పిల్లలు ఆపురావురు మంటూ వస్తున్నారు.''

''ఎదురేగి సగౌరవంగా తీసుకురా.''

మాతా పుత్రులకు ఎదురేగింది.

''రామ్మా రా. అలాగే నిల్చుండిపోయారేం బాబూ! లోపలికి రండి — ఇది మీ ఇల్లే. పాపం! ఆకలితో ఎంత అలమటించి పోతున్నారో!''

''రా, తల్లీ, రా. అలా నివ్వెరపోయి చూస్తారేం?'' అన్నాడు పరదేశి.

''అయ్యా! ముక్కూముఖమూ తెలియని మాకింతటి మర్యాదా! మేమేదో పొట్టచేత బట్టుకుని వచ్చినవాళ్ళం.''

''అలా భావించకమ్మా! నీ కూనల ఆకలీ, నీ శోకమూ పోగొట్టటానికే మాకు మిగిలిన ఈ రోలును ఒక్క రూకకైనా విక్రయించదలచి వెలికి తీశాం. రోలుక్రింద నేలలో నిక్షిప్తమైన నిధి దొరికింది.''

ఆనందాశ్చర్యాలతో ఉక్కిరిబిక్కిరిఅవుతూ ఆ మాతా పుత్రులు పరదేశి దంపతుల పాదాలకు మ్రొక్కారు.

కాస్సేపట్లోనే ఈ వార్త ఊరంతా ప్రాకింది.

ఊరి జనులందరూ తరలివచ్చి పరదేశి దాన పరతనూ, అతనిపై పుష్కలంగా కురిసిన శివ కృపనూ వేనోళ్ళ కొనియాడారు. తమ అవజ్ఞని మన్నించమని వేడుకున్నారు.

కర్ణాకర్ణిగ ఈ వార్త రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయునికి కూడా తెలియవచ్చింది. ఆయన తన సహజమైన ఉదార భావంతో పరదేశిపై పగ మానుకుని యథా ప్రకారం దివాణం నుండి ధనధాన్యాదులు అతనికి పంపటం మొదలెట్టాడు.

## నాగలక్ష్మి!

కర్నాటక రాష్ట్రంలో కొన్ని వూళ్లలో దేవదాసి కులం యింకా వున్నది. ఆ కులంలోపుట్టిన ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేయరట. వయస్సురాడంతోనే ఆ పిల్లను భగవంతునికి కైంకర్యం చేస్తారట. ఆనక ఆమె దేవదాసిగా పబ్లిక్కున వేశ్యగా స్థిరపడుతుందట. చించన్సూరులనే వూరులో 19 ఏళ్ళ లక్ష్మి అనే పిల్లను దేవదాసిని చేయ ఆ పిల్ల తల్లి ఆలయంలో నానాఆర్భాటం ఆరంభించిందట. నాకు యిదొద్దు నేను పెళ్ళి చేసుకుని కాపురం చేసుకుంటానంటే వాళ్ళమ్మ అపచారంపొమ్మందట. తీరా గుళ్ళో తంతు ఆరంభమయ్యే సరికి సరసర వో పాము వచ్చి ఆమె మీంచి పాకి, తల మీద పడగ విప్పి కూర్చుందట. దాంతో ఆ గుడి పూజారి నీ పిల్ల నీ వృత్తి లోకి దింపనని నాగేంద్రునికి ప్రమాణం చేసి, నీ కూతుర్ని వదిలి పొమ్మని వేడుకో అంటే అలానే చేసిందటావిడ. ఆ ప్రమాణం తీసుకుని నాగరాజు వెళ్లి పోయాడట. దేవదాసి వృత్తి నిర్మూలనకు నాగేంద్రుడే కంకణం కట్టుకున్నాడా ఏమి! ఏమో?

## వాలిన గోపురం!

ఇంగ్లండుకు చెందిన చెస్టర్‌ఫీల్డ్‌లోని వో చర్చి గోపురం వోపక్కకు వాలిపోయి ఉంటుందట. దీనికి కారణ మేమిటంటే వో తమాషా కథ చెప్తారట. కొన్నేళ్ళక్రితం వో పిశాచి చెస్టర్‌ఫీల్డ్ నగరంమీద ఎగిరివెళ్తూ, అది చర్చి అని తెలియక ఆ గోపురంమీద కూర్చుందనీ యీలోగా క్రీస్తు భగవాను శక్తివల్ల ఆ పిశాచి వూగిపోయిందనీ, అది పారిపోయే ప్రయత్నంలో ఆ గోపురం వంగిపోయిందనీ తాము నమ్మినవారు తమని అడిగినవారిని నమ్మిస్తారట. ఈ మూఢనమ్మకాలు మనిషిని వదలవు ఏ దేశంలో నయినా...

## విచిత్ర జీవితేచ్ఛ!

లండనుకు చెందిన 53 ఏళ్ల జేమ్స్ హంఫెరీ మోరిస్ చిన్నప్పటినుంచీ తాను ఆడదై పుడితే బాగుణ్ణనుకుంటుండేవారట. చిన్న తనంలో గౌనులు తొడుక్కునేవారట. టైమ్స్ ఆఫ్ లండన్ పత్రికకు స్వేచ్ఛా విలేఖరి (అనొచ్చా!)గా యీయన పని చేసే వారట. ఈయన 15 సంవత్సరాలు ప్రపంచమంతా తిరిగారట. హిమాచలం నుంచి మవుంటు ఎవరెస్ట్ శిఖరం వరకూ దర్శించారట. ఈ సందర్భంలో 15 పుస్తకాలు కూడా వ్రాశారట. ఈయన తనకు చిన్నతనంలో పుట్టిన వాంఛ చంపుకోలేక భార్యా పిల్లలూ వున్నా కూడా 1964 లో తన సెక్స్ మారడానికి మాత్రలూ మందులూ వాడ నారంభించారట. 1972 నాటికి యీయన గొంతులో కొంచెంగా మార్పు రావడం, వక్షస్థలం ఎత్తవడం ఆరంభమయిందట. యునైటెడ్ స్టేట్స్‌లోని వో ప్రఖ్యాత డాక్టరుగారు వో చిన్న ఆపరేషనుతో యీయన పురుష జననేంద్రియాన్ని తీసివేసి ఆ స్థానంలో కృత్రిమ మర్మావయాన్ని మరో ఆపరేషను ద్వారా ఏర్పరచారట. 53 ఏళ్ల మోరిస్ యిపుడు స్త్రీగా మారి జాన్ అనే పేరు మార్చుకుని, తన భార్యా పిల్లలతో వుంటున్నారట. తన జీవితేచ్ఛ నెరవేరిందని, తనకు యీ వయస్సులో లైంగిక వాంఛ లేదనీ, తన భార్య తనను ప్రేమగా, ఆదరణతో చూస్తున్నదనీ అన్నారట.

## అర్భెల్లు సావాసం చేస్తే...!

ప్రతీదానికి భయపడటం, ఆవేశపడటం, ఆత్రపడటం వంటివన్నీ భయంకర మైనఅంటు రోగాల కన్నా భయంకరమైన అంటు రోగాలనీ, ఈ రకమైన భయపడటం, ఆవేశపడటం, ఆత్రపడటం, కీడు శంకిస్తూ వుండటం, పిరికితనం అన్నీ కూడా మనిషి నుంచి మనిషికి అంటుకుంటాయని, ఎంత స్థిరసంకల్పం, ధైర్యంవంటివి వున్నవారైనా పై గుణాలున్న వారితో స్నేహం చేస్తే ఆ గుణాలన్నీ అంటుకుంటాయనీ, అమెరికాకు చెందిన వో విశ్వవిద్యాలయానికి చెందిన మనస్తత్వ నిపుణు లందరూ కొన్ని ప్రయోగాల ద్వారా ఏకాభిప్రాయానికి వచ్చి యీ అభిప్రాయం వెలిబుచ్చారట—అర్భెల్లు సావాసం చేస్తే వారు వీరవుతారని మన పెద్దలననే అన్నారు కదా!

## పారాణి ఆరకముందే వైధవ్యం!

కమ్మాళపట్టి అనే గ్రామానికి చెందిన 19 ఏళ్ల చిత్తన్ అనే అతనికి మొన్న నవంబరు 18 వ తేదీన అదే వూరుకు చెందిన 17 ఏళ్ల పార్వతి అనే అమ్మాయితో వివాహం జరిగిందట. 20 వ తేదీన అతను తన బావమరదులతో కలిసి సైకిళ్ళ మీద కాశినాయకన్ పట్టి అనే గ్రామానికి వెళ్తుండగా వో లారీ అతని సైకిలును ఢీకొని చిత్తన్ను తన పొట్టన పెట్టుకున్నదట.

## మహాత్మాగాంధీ చిత్రానికి 5కోట్లు సహాయం!

హాలీవుడ్‌కు చెందిన సర్ రిచ్చర్డ్ ఎట్టన్‌బరో అనే ఆయన మహాత్మాగాంధిజీవిత కథనీ యథాతథంగా సినిమా తీయసంకల్పిస్తే ఆ విషయం ఏమి పట్టనట్టు మొట్ట మొదట వూరుకున్నా భారత దేశం ఉన్నట్టుండి ఆ సినిమాకు అయిదు కోట్ల రూపాయలు పెట్టుబడికి సహాయం చేస్తానని వాగ్దానం చేసిందట. ఈ సినిమాకి పదకొండున్నర కోట్ల రూపాయలు ఖర్చవుతుందట. మహాత్మా గాంధి వేషం బెంజమిన్ కింగ్‌స్లే అనే ఆయన, కస్తూరిబా వేషం రోహిణి అనే ఆమె వేస్తారట. ఈ సినిమా దర్శకత్వం వహించిన సర్ రిచ్చర్డ్ అట్టిన్బరో ఒకటిన్నర కోటి పారితోషికం తీసుకుంటారట. ఈ విషయం తెలిసిన భారతదేశపు దర్శకులూ, నిర్మాతలూ నేంలేయి గాంధి సినిమా! అయిదుకోట్లూ మాకివ్వరాదూ అని సణుక్కుంటున్నారట అన్నట్టూ శివాజీగణేశన్ మహాత్మాగాంధి వేషం ధరించలేడా ఏమిటి!?



# డాక్టర్ సలహాలు

— డా॥ కె. వెంకటేశ్వరరావు

**ఎస్. ఎల్. ఆర్. — కాళహస్తి**

మా అబ్బాయికి వయస్సు 7 సం. లు. వాడికి చదువులో జ్ఞాపకశక్తి తక్కువ. చదివిన అక్షరములు జ్ఞాపకం ఉండవు. కారణమేమిటి? వాడే మందులేవైనా ఉంటే తెలియపరచండి.

జ్ఞాపకశక్తిని పెంపొందించడానికి మాత్రలు లేవు. పిల్లలకి ఆటల మీద ధ్యాస ఎక్కువగా ఉన్నప్పుడు చదువు మీద శ్రద్ధ అంతగా ఉండదు. చదివేది కాసేపయినా దానిమీద శ్రద్ధ ఉంటే జ్ఞాపకం ఉండకపోవటం జరుగదు.

అరుదుగా, పైవన్నీ సరిగానే ఉన్నాయని తీర్మానించబడినప్పుడు, మెదడు భాగంలో కొన్నిరోగాల వల్ల జ్ఞాపకశక్తి లేకపోవచ్చును. ఇది నిపుణులైన న్యూరోఫిజీషియన్లు పరీక్షించి నిర్ణయించవలసిన విషయం. కానీ చిన్నపిల్లలకి ఈ విధంగా రావటం అరుదని గమనించాలి. పై రోగానికి మందులు న్యూరోఫిజీషియన్లే తెలియజేస్తారు.

**ఎమ్. ఎస్. — హనుమకొండ**

గొనేరియా వ్యాధి మగవారికి ఎలా వస్తుంది? ఎందువలన వస్తుంది?

మగవారికి గొనేరియా రోగం, గొనేరియా రోగం ఉన్న స్త్రీలతో లైంగిక కలయిక జరపటం వల్ల ఏర్పడుతుంది.

గొనేరియా అనేది "నేసీరియా గొనేరియా" అనే సూక్ష్మక్రిమి వల్ల ఏర్పడుతుంది. ఈ రోగం లైంగిక కలయిక ద్వారా మాత్రమే ఒకరి నుంచి ఇంకొకరికి వస్తుంది.

జననేంద్రియంలోనుంచి, చీము కారటం, మూత్ర విసర్జన సమయంలో నెప్పి, బొట్లు బొట్లుగా మూత్ర విసర్జన జరగటం ఈ రోగ లక్షణాలలో కొన్ని.

స్త్రీలకి, ఫెలోపియన్ ట్యూబు వాయటం తద్వారా కొన్ని అవాంతరాలేర్పడటం జరుగుతాయి. ఈ రోగం ఉన్న స్త్రీలకి జన్మించే శిశువులకి కళ్ళుజబ్బు వచ్చి కళ్ళు పోయే ప్రమాదం ఉంటుంది.

**ఎల్. ఎస్. ఆర్. — కడప**

నాకు సుమారు 5 సం. ల నుండి శరీరము దద్దుర్లు లేస్తున్నవి. శరీరము దురదగా వున్నది. రక్త పరీక్ష చేయిస్తే 'ఇస్నోఫీలియా' 47 శాతం వున్నదని 'నియోసినిల్ ఫోర్టు' మాత్రలు సాండోజ డెకెలోవిట్ సిరప్ వాడమన్నారు. ఇవి వాడాక తగ్గినది. తిరిగి ఇప్పుడు దగ్గు, కఫము దద్దుర్లు వచ్చినవి. ఈ జబ్బు పూర్తిగా తగ్గుటకు ఏమి చెయ్యాలి?

"ఈ ఇసినోఫీలియా" అనేది నెత్తురులోని తెల్ల కణాలలో ఒక తెగ అయిన 'ఈయోసినోఫిల్స్' సంఖ్య ఎక్కువ అవటమే! వీటి సంఖ్య ఎక్కువ అవటానికి ముఖ్య కారణాలు "అలర్జీ" అంటే శరీరానికి పడని వస్తువులు తీసుకోవటం వల్ల, కడుపులో కొన్ని క్రిములు చేరటం వల్ల శరీరంలో ముఖ్యంగా నెత్తురులో కొన్ని మార్పు లేర్పడతాయి.

ఈ ఇస్నోఫీలియా తరచూ వచ్చే వారు ఇటువంటి కారణాలేమైనా ఉన్నాయో లేవో అనే విషయాన్ని వైద్యుల చేత పరీక్షింపచేసుకోవాలి. మల పరీక్ష ద్వారా కడుపులో క్రిములు ఉన్నదీ లేనిదీ తెలుసుకోవచ్చును.

**టి. వి. ఎస్ ఆర్. — అండలూరు**

నా వయస్సు 21సం.లు. నాకు కూర్చొనిఎక్కువ సేపు చదువుతూగాని లేక వేరే ఏదైనా పని చేస్తూగాని, ఉండిలేస్తున్నప్పుడు ఒక్కొక్కసారి మైకం కమ్ముతున్నట్లుగా ఉంటుంది. ఇలా ఒక్క నిముషం మాత్రమే ఉంటుంది. ఆ తరువాత మామూలుగానే ఉంటుంది.

దీనికి అనీమియా, పాస్చ్యురల్ హైపోటెన్షన్ అనేవి ముఖ్య కారణాలవుతాయి. నెత్తురులో హిమోగ్లోబిన్ ప్రమాణం తగ్గటంవల్ల అనీమియా ఏర్పడుతుంది. హిమోగ్లోబిన్ ప్రమాణం ఇనుప ధాతువు తగ్గటం వల్లగానీ, అధిక రక్త స్రావం వల్లగానీ ఏర్పడుతుంది.

పాస్చ్యురల్ హైపోటెన్షన్ మెదడుకి రక్త సరఫరా ఒక క్షణంపాటు తగ్గటంవల్ల ఏర్పడుతుంది. ఇలా కూర్చుని ఉన్నట్లుండి లేచినప్పుడు కొందరికి అవుతుంది. అనీమియా ఉన్న వారికి ఈ లక్షణం తరచూ కనబడుతుంది. ఇనుపధాతువులు ఎక్కువగాకల మాత్రలుగానీ, కాప్సూల్స్‌గాని వేసుకోవడం, ఆహారంలో ఎక్కువ ఆకుకూరలు తినటంమంచిది.

**వి. ఆర్. — ప్రొద్దుటూరు**

మా కుమారుని వయస్సు 5 సం.లు.పిల్లవాడు మలము విసర్జించునపుడు రక్తము కూడా కొద్దిగా పడుతున్నది. దీని గురించి మీ సలహా ఏమిటి?

పై లక్షణాలు డిసెంటరీవల్లగానీ, 'ప్రొలాప్స్ రెక్టం' వల్లగానీ ఏర్పడవచ్చును. మల పరీక్ష చేయుటంవల్ల డిసెంటరీ ఎందువల్ల (అమీబా వల్లనా, బేసిల్లై వల్లనాఅనేది) వచ్చిందనే విషయం నిర్ధారణ అవుతుంది. ఫలితాన్నిబట్టి వైద్యం చేయించుకోవాలి.

మలవిసర్జన సమయంలో ఆసనద్వారం నుంచి కండ బహిర్గతం అయి నెత్తురు కారుతూ ఉంటే ఆ రోగాన్ని ప్రొలాప్స్‌రెక్టం అని అంటారు. చాలా రోజులపాటు విరేచనాలవడం వల్ల ఇలా జరిగే అవకాశం ఉన్నది. 5 సం.ల వయస్సు అవటం వల్ల పైల్స్ మొదలయినవి వచ్చే అవకాశంలేదు.

మీ అబ్బాయికి మల పరీక్ష చేయించి వైద్యులకి చూపండి. ఒక్కసారి మలపరీక్షలో ఏమీతేలకపోయినా, 3, 4సార్లు పరీక్ష చేయించటంవల్ల రోగ నిర్ధారణ జరుగుతుంది.

# అభినందన గ్రీటింగ్ కార్డ్స్

ప్రతి పండుగ ప్రతి పర్వము
అభినందోత్సవము
మనోమందిరములో చల్లగవీచే
కవితా పవనాలు

శుభాకాంక్షల పత్రికలకు
ఒకే పేరు
అభినందన

ABHINANDANA

శ్రీ బాపు గీసిన
అందమైన
అనేక చిత్రాలు

## స్టూడెంట్స్ బుక్ సెంటర్

బుక్ సెంటర్

ఏలూరు రోడ్డు, విజయవాడ-2
ఫోన్: 62222

DOLPHIN PUBLICITY

అన్ని బుక్ షాపులలో మరియు ఫ్యాన్సీ షాపులలో లభించును కేటలాగుకు రు.2.M.O పంపండి

---

VB/3/TEL

# పైగా బహుమానము రూపాయలు 1,00,000

## సులభంగా ఎలా అదృష్టమును పొందగలరో చూడండి.

వైశ్యా బ్యాంకు
స్వర్ణోత్సవపు క్యాష్ సర్టిఫికేట్లు!
నేడే మా నూరు రూపాయల
క్యాష్ సర్టిఫికేట్లను కొనండి.
అది కేవలం 63 నెలల్లో
ఎలా రు. 152/50గా
పెరుగుతుందో గమనించండి.
10% వడ్డీని మాత్రమేకాక
సిరిసంపదలను పొందండి



ది వైశ్యా బ్యాంకు లిమిటెడ్
అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసు
72, సెయింట్ మార్క్స్ రోడ్డు, బెంగుళూరు-560 001

ఛైర్మన్ : టి. కె. కె. భగవత్

# బొమముడి

నా హృదయ విపంచి రవళించిన
గీతికలో మధురిమ లోపించిందని
బొమముడి వేయకు
ప్రభూ!
నీవు కోరిన రాగమాలపించే
రీతిలో శ్రుతిచేసి
పలికించే శక్తి నివ్వడం
నీ వంతు కాదా ?

— గోవిందరాజు రామకృష్ణారావు

# డాక్టర్ సలహాలు

**డి. ఎస్. బి. — గుత్తి**

నాకు 22 సం. ల వయస్సు. సుమారు 2 సం. ల నుండి "ఇంటస్టైనల్ డిసార్డర్స్"తో బాధ పడుతున్నాను. మలంలో "అసారారిస్" ఉన్నాయని డాక్టరు చెప్పారు. 25 సెం.మీ. పొడవున్న రవుండ్ వర్మ్ రెండు నెలల క్రితం మలంలో బయట పడింది...

కడుపులో రవుండ్ వర్మ్స్ ఉన్న వారు రెండు రోజుల పాటు రాత్రి పడుకోబోయే ముందు 'పైపరజీన్ సిట్రేట్'గాని, 'పైపరజీన్ అడిపేట్' గాని మాత్రల రూపంలోనో, ద్రవ రూపంలోనో తీసుకోవలసి ఉంటుంది. ఇలా రెండుసార్లు రాత్రి పూట తీసుకున్న పది రోజుల తర్వాత తిరిగి మల పరీక్ష చేయించుకోవాలి. మలంలో ఈ పురుగుల గుడ్లు ఉన్నట్లయితే ఒక నెల తర్వాత మళ్లీ రెండు రోజుల పాటు మందు పుచ్చుకోవలసి ఉంటుంది.

సానిటరీ లెట్రిన్ వాడటం ద్వారాను, పరిశుభ్రంగా వండబడిన ఆహారం తీసుకోవటం ద్వారా ఈ పురుగులు తిరిగి చేరకుండా చూసుకోవచ్చును.

**ఆర్. ఆర్. — నర్సరావుపేట**

నాకు 4 నెలల నుండి తొడలవద్ద దురదగా ఉంటుంగి. గోకితే తెల్లని చారలుగా ఏర్పడుతున్నవి. దీనికి ఏమి చెయ్యాలి?

దీనిని టీనియా క్రూరిస్ అని అంటారు. అంటే చర్మానికి ఫంగస్ రోగం వచ్చిందని అర్థం.

దీనికి పై పూతగా లెడర్‌కార్ట్స్, మిల్లీకార్టెన్ వయోఫాం, కెనలాగ్— ఎస్ అనే వాటిలో ఏదైనా వాడవచ్చును.

గ్రైసోవిన్ మాత్రలు రోజుకి ఆరు వంతున వరుసగా 10 రోజులపాటు వాడండి.

## ధర్మపథం

# భగవంతుని రూప నిర్ణయం

— బులుసు వేంకటరమణయ్య

సర్వ రూపుడగు భగవంతుని రూపాన్ని నిర్ణయించడం సాధ్యం కాదు. భక్తుడు ఏ రూపాన్ని ధ్యానిస్తే ఆ రూపంలోనే కనబడతాడు. ఆయన రూపాన్ని నిర్ణయించడానికి యత్నించేవాడు బోల్తా పడతాడేకాని కృతార్థుడు కాలేడు.

చిత్రకళలో ఆరితేరిన ఒక గొప్ప చిత్రకారుడు, వ్యక్తిని ఒకసారి చూడగానే—ఫోటో తీసినట్లు ఆ వ్యక్తిని అతి త్వరలో చిత్రించగలడని గొప్ప ఖ్యాతి గడించాడు. ఈ విధంగా ఎందరో మహా పురుషుల చిత్రాలను చిత్రించాడు. భగవానుడగు శ్రీకృష్ణుని చిత్రాన్ని అంతవరకూ చిత్రించలేదు. అట్టి అవకాశం చాలా కాలం లభించలేదు. ఎంతో యత్నించి, ఆ అవకాశాన్ని సంపాదించి శ్రీకృష్ణుని దర్శించి, క్షణం ఉండి, వారం దినాల్లో ఆయన చిత్రాన్ని అందజేస్తానని చెప్పి వెళ్లిపోయి, తన యావత్ప్రతిభనూ ఉపయోగించి, అద్భుతంగా తయారైన ఆ చిత్రపటానికి ఒక తెల్లని వస్త్రం కప్పి, అనుకున్న రోజుకి శ్రీకృష్ణుని వద్దకు తీసుకువెళ్లాడు. తీరా పైని కప్పిన వస్త్రం తీసిచూస్తే, అందులో శ్రీకృష్ణుని పోలిక ఏమాత్రమూ కానరాలేదు. తనకే ఆశ్చర్యం కలిగింది. అతడు చిన్నబోయి, శ్రీకృష్ణుణ్ణి క్షమింపగోరి, మరి వారం రోజులకు సరియైన చిత్రాన్ని చిత్రించి తెస్తానని మాట యిచ్చి వెళ్లిపోయాడు. వారం దినాలకు మళ్లీ కొత్త చిత్రం తీసుకు వచ్చాడు. కాని దానిలో కూడా భగవానుని పోలిక లేదు. ఇలా చాలా సార్లు ప్రయత్నించి ఆ చిత్రకారుడు భగ్న మనోరథుడైనాడు. అతని అహం నశించింది. విరక్తి కలిగింది. వైరాగ్యంతో అతడు ఊరు విడిచి వెళ్లిపోతూ ఉండగా— దారిలో నారదమహర్షి కనబడి, దైన్య కారణం అడిగి తెలుసుకుని "పిచ్చివాడా! భగవంతుని స్వరూపం యిదమిత్థమని నిర్ణయించడం మహా మునులకు కూడా సాధ్యం కాదు. నీవు ఆయన రూపాన్ని యెలా చిత్రించగలవు? ఈ భ్రాంతిని విడువు. నీవు శ్రీకృష్ణునికి మాట యిచ్చేవు కాబట్టి, దానిని నెరవేర్చి, తృప్తి పడడం కోసం నీకొక ఉపాయాన్ని చెప్తాను" అని చెవిలో రహస్యంగా ఏదో చెప్పి వెళ్లిపోయాడు. చిత్రకారుడు వెనక్కి తిరిగి ఊరికి వచ్చి చిత్రం తయారయిందని శ్రీకృష్ణునికి తెలియజేసి, తెల్లబట్ట కప్పిన ఒక చిత్రపటాన్ని ఆయన ముందు ఉంచి తెర తీసివేశాడు! నిజానికి అది చిత్రం కాదు! ఒక పెద్ద అద్దం. అందులో శ్రీకృష్ణుని ప్రతిబింబం ఉన్నది ఉన్నట్లు కనబడింది. విషయమంతా గ్రహించి శ్రీకృష్ణుడు చిరునవ్వు నవ్వుకున్నాడు. చిత్రకారుడికి తృప్తి కలిగింది. అతడు శ్రీకృష్ణునికి సాష్టాంగపడి "ప్రభూ! నా అపరాధం క్షమించు. నీ చిత్రాన్ని చిత్రించగలనని గర్వపడ్డాను నీ మహిమ తెలుసుకోలేక పోయాను. విశ్వరూపుడవగు నీ రూపాన్ని చిత్రించడం ఎవ్వరికి సాధ్యమవుతుంది? నిర్మలమైన ఆదర్శమే నీరూపాన్ని చిత్రించగలదు" అని అన్నాడు.

(భగవాన్ శ్రీ సత్యసాయిబాబా ప్రసంగాలలోని ఒక చిన్న కథ ఆధారంగా.)






Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor ; S. Radhakrishna.

## ఉ త్త రా లు

(5 వ పేజీ తరువాయి)

### సీ రి య ల్

జ్యోతి ముఖ చిత్రంతో ఉన్న 'నా' పత్రికను పొద్దున్నే లేచి అందుకున్నాను. ఫస్టునే చదివింది "ప్రేమ తీర్థం" సీరియల్. మొదటి నుండి ఆసక్తిగా సాగుతూంది. ముగింపేమిటంటే నా అభిప్రాయం ప్రకారం దీప మనస్సు కరిగి చంద్రంను వివాహమాడటం. ఇక కథల్లో అతి రమ్యకరమైనది పొగమంచు. ఈ కథ రచయిత్రి శైలి అత్యద్భుతం. ఫస్టు చూసి అనువాద కథ అనుకొన్నాను. పల్లెలో పుట్టిన సుభద్రకి, రేష్మకి సంస్కారంలో ఎంత వ్యత్యాసమో తెలిసి "నిజమే! పట్నంలో పెరిగినా మంచి బుద్ధులు లేకపోవటం రేష్మ ఒక చక్కని ఉదాహరణ" అని అనుకొన్నాను. బొద్దింకలు చదివి నేటివార్తలు (అక్కడా ఇక్కడా) వల్ల ఆ కథ ఉద్భవించిందేమో నని నా అనుమానం. స్పందనలో చంప పాత్రను చక్కగా తీర్చి దిద్దారు. ప్రేమ తీర్థం రచయిత్రి కళ్యాణి గార్కి కాంగ్రాట్స్.

సుమప్రియ ( మధిర )

### క థ లు

విన్నకోట సుశీలాదేవిగారి పెద్ద కథ ప్రేమిస్తే ఏమవుతుంది? చదవటానికి కనువిందుగా, పసందుగా ఉంది. ఇలాంటి కథలను ఎక్కువగా ప్రచురించాలి. పాఠకులు వాటిని ఆదరించగలరు.

ఎం. రమాదేవి (జనగాం)

* * *

28.11.80 సచిత్ర వారపత్రిక ముఖచిత్రం వంశవృక్షంలో జ్యోతి ఎంతో ఆకర్షణీయంగా, పదేపదే చూడాలనిపించేలా ఉన్నది. ప్రేమతీర్థం, స్పందన సీరియల్స్ ఎంతో ఇంటరెస్ట్‌గా సాగుతున్నాయి. బొద్దింకలు కథలో మంచివాళ్ళు అడుక్కోవటం దుకు పసిపిల్లల్ని కళ్ళు పొడిచి హింసించడం బాధనిపించింది. మొత్తంమీద ఈ వారం కథలన్నీ బాగున్నవి. చాలా థాంక్స్.

కె. శకుంతల [చిట్యాల]

* * *

28.11.80 నాటి సంచిక జ్యోతి ముఖచిత్రం భారతీయ సంస్కృతిని ప్రతిబింబింప జేసే హైదవ వారిలా చాలా ముచ్చటగా ఎంతో బావుంది. కథల్లో పొగమంచు, బొద్దింకలు, తప్పెవరిది? బాగానే ఉండి మనస్సుల్ని ఆకట్టుకొన్నాయి. ప్రేమిస్తే ఏమవుతుంది? కథ పాతగా అనిపించినా మలుపులు తిరిగే కథా విధానంతో ఉత్తేజం కలుగక తప్పదు. ఆచార్య నిమ్మ రామచంద్ర ( చేర్యాల )

* * *

జ్యోతి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించిన కథలన్నీ వెరైటీగా ఉండి, చాలాబావున్నాయి. బొద్దింకలు కథలో, పసివాడి కళ్ళకు బొద్దింకలు పెట్టి గుడ్డివాడనిచెప్పి అడుక్కోవటం ఘోరంగా ఉంది.

పొగమంచు, సలహా కథలు బాగున్నాయి. రచయిత[త్రు]లకు నా ధన్యవాదాలు అందజేయండి. ఈ వారం ప్రచురించిన కార్టూన్స్ అన్నీ బాగా ఉన్నాయి.

డి. చంద్రశేఖర్ దేశాయ్ [ ఆదోని ]

* * *

జ్యోతి ముఖచిత్రంతో వెలువడిన పత్రిక బాగున్నది. బహుమతి పొందిన ఐదు కథలకన్నా ఈ వారం పత్రికలో ప్రచురించిన కథలు చాలా బాగున్నాయి. చదువుతున్నంతసేపు కుతూహలాన్ని కలిగించాయి. కథలు అంటే అలా ఉండాలి!

కోట నాగరాజకుమారి, సీ తా రా మ య్య (బెస్తవారపేట)

# అందాలతార లత అందాన్ని తీరుగా తీర్చిదిద్దేది లక్స్

లత రూపం వెలుగులు చిందే రూపం. ఆ సౌంద[illegible]ం.
ఆ సున్నితమైన రూపంకోసం ఆమె వాడేది లక్స్.
''నా చర్మ సౌందర్యాన్ని కోమలంగానూ, మనోహరంగానూ
రూపొందించుకునేందుకు నాకు లక్స్ కావాలి.'' *Latha*




## శుద్ధమైన, సౌమ్యమైన లక్స్–
## సినిమా తారలకు సౌందర్యాన్నిచ్చే సబ్బు

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన




సిటీబస్సు దిగి బీచ్‌వైపు నడిచివెళ్తూ, ఎవరో నన్ను మార్చి మార్చి చూస్తున్నట్టనిపించి అటు వంక చూశాను.

అతను నా వంకే తదేకంగా చూస్తున్నాడు !

ఎన్నేళ్ళక్రితం చూసిన మనిషినైనా గబుక్కున గుర్తుపట్టగలను నేను — అతను పరమహంస !

బియ్యే నాతోపాటు కల్సి చదివాడు.

''గుర్తున్నానా ?'' అన్నాను నేనే పలకరింపుగా.

''బాగుంది — ఈ ఎనిమిదేళ్ళకే మరచిపోతే ... ఇక ఉద్యోగాలు చెయ్యనక్కరలేదు — నువ్వు గుర్తిస్తావో లేదోననీ నేను చూస్తున్నాను'' అన్నాడు పరమహంస తప్పుకు దొరక్కుండా.

అతని వెనుక యింకో ఆయన కూడా వున్నాడు— స్కూటర్‌కి తాళంవేసి వచ్చాడతను.

రోడ్డు దిగి, యిసుకలో నడుస్తున్నాం ముగ్గురం —

నిజమే—ఎనిమిదేళ్ళయింది కాలేజీ వదిలిపెట్టి. అప్పట్లో పరమహంస చాలా డేషింగ్‌గా వుండేవాడు.

''ఏం చేస్తున్నావూ ... యేమిటి ?'' అన్నాను మాట కలుపుతూ —

''ఏముందీ. మనది తిరుగుడు వ్యవహారం. మెడికల్ రిప్రజెంటేటివ్‌గా అటు దేశానికీ, యిటు మా కుటుంబానికీ ఉపయోగపడుతున్నాను'' అంటూ నవ్వేడు.

''ఉండేది ఎక్కడా?'' అడిగాను.

''హైద్రాబాద్‌లో — నెలకో టూరైనా వస్తూంటానిక్కడికి'' అన్నాడు. ఇసుకలో కూర్చున్నాక అడిగాడు ''మరి నీ సంగతులేం చెప్పవేం ?'' అని —

''ఏముందీ — అప్పులూ, ఆర్భాటాలూ చెయ్యకుండా బతగ్గలిగే ఉద్యోగం. మేమిద్దరం, మాకిద్దరూ అని గర్వంగా చెప్పకునే కుటుంబం. ఎప్పుడూ సాహిత్య పత్రికలూ, అప్పుడప్పుడు రాజకీయ పత్రికలూ చదవటం — ఇదే జీవితం — '' అన్నాను.

''బాగుందోయ్'' అన్నాడు నవ్వి —

''ఏమిటి బాగుండటం ?''

''నీ జీవితం కాదు — నువ్వు నీ గురించి చెప్పిన విధానం బాగుంది. నీ కథలు చూస్తున్నాను. ఈమధ్య ఉధృతంగా రాస్తున్నట్టుందే'' అన్నాడు —

నేనేం మాట్లాడలేదు. అప్పట్లో నేను కాలేజీ మేగ్‌జైన్‌కి కథలు రాసేవాడిని. ఆ సంగతింకా అతనికి గుర్తుందన్నమాట !

''ఉన్నచోట కూర్చుండి రెండు చేతులా సంపాదించడమంటే ఇదే — ఏ మాత్రం వెనకేశావ్'' పరమహంసే అడిగాడు.

నేను నవ్వి వూరుకున్నాను.

''ఏ పేరతో కథలు రాస్తూంటారు మీరు?'' అడిగాడు పరమహంసతో వచ్చినాయన —

అతని ప్రశ్నకు సమాధానం పరమహంసే చెప్పాడు.

''వారిని పరిచయం చేశావ్‌గాదు'' అన్నాను పరమహంసపై నిందవేస్తూ.

''సారీ. మాటల్లోపడి మరిచేపోయాను ... ఈయన జోగారావనీ నాకు బాగా కావలసినవాడు'' అన్నాడు.

''చాలా సంతోషం'' అన్నాన్నేను అతన్ని చూసి. ఆ తర్వాత చాలా విషయాలు మా మాటల్లో దొర్లాయి. చదువులు, ఆస్తులు, పిల్లలు, రాజకీయాలూ, సిన్మాలూ —

పగటి వెలుగు పోయి, సముద్రంమీద పల్చగా కనబడే చంద్రుడు చిక్కపడ్డాడు.

కాస్సేపు మౌనం తర్వాత పరమహంస అన్నాడు—

''ఈ వూరి ప్రజలు చాలా అదృష్టవంతులోయ్. ఎంచక్కా సముద్రాన్ని చూస్తూ సాయంత్రాలు బీచ్‌లో హాయిగా గడిపేయవచ్చు.''

''అవునవును. తాగటానికి నీళ్ళు లేకపోయినా ఎదురుగావున్న ఈ మహాసముద్రాన్ని చూసే ఆనందించాలి మరి!'' అన్నాను నా మనసులోని అక్కసంతా ధ్వనించేలా.

''నీళ్ళకి అంత కరువా యిక్కడ ?'' ఆశ్చర్యపోయాడు.

''కొత్త యింటికి నేను ఖర్చుపెట్టిన యాభైవేలలోనూ అయిదువేలు నీళ్ళకే అయ్యాయంటే నమ్ముతావా నువ్వు ?'' అన్నాను.

''నమ్మను — అయినా బావులు పడనిచోట్ల పంపులేస్తున్నారటగా'' అంటూ జోగారావు వంక అమాయకంగా చూశాడు పరమహంస.

నా బాధ వెళ్ళగ్రక్కేందుకు సమయం వచ్చింది—

''వేస్తున్నారు. కానీ యింటికి పంపు వేయాలంటే బ్రహ్మప్రయత్నమే చేయాలి. పంపుకోసం అప్లికేషన్ పెట్టిన రెండు నెలలకిగాని ఆ కాగితం అధికార్ల ముఖం చూడ్డానికి నోచుకోదు — ఆ మాటకొస్తే పెట్టిన రెండో రోజుకే ఆ కాగితం మాయమౌతుంది — అదేమని ప్రశ్నించడానికి సీట్లో మనిషుండడు — వున్నా జవాబుండదు. గుమస్తాగారి డ్రాయర్లో నోట్లుపడితే ఆ మర్నాడే పరమశివుడిలా ప్రత్యక్షమౌతుంది — అక్కడ్నించి సూపర్‌వైజర్‌గారి దగ్గర మరో మజిలీ — అక్కడో పెద్దనోటు — అక్కడ్నించి ఎ. ఇ. గారు. అక్కడా డిటో — ఆ తర్వాత ఫిట్టరూ, హెల్పరూ...వీళ్ళందరికీ వంతు వంతునా వారి వారి రేట్ల ప్రకారం యిచ్చుకుంటూ నెలల తరబడి వాళ్ళవెంట తిరిగితేనేగాని పంపు రాదు— ఈలోగా యిల్లు సగానికి పైగా పూర్తవుతుంది. నీళ్ళు కొనుక్కోక ఏం చేస్తాం ?''

పరమహంస మధ్యలో యేదో అనబోయి వూరుకున్నాడు —

''నిజంగా భగీరధుడు కూడా గంగను భూమికి తేడానికి అంత కష్టపడి వుండడు—ఇల్లు పూర్తయి ఎనిమిదినెలలు దాటినా నా ప్రయత్నమింకా పూర్తవలేదు'' అన్నాను.

# ఒక భగీరథుడి కథ

''అదేం ? పంపు యింకారాలేదా ?''

ఈ ప్రశ్న వేసింది పరమహంస కాదు. జోగారావు !

''వచ్చింది. కానీ వచ్చిందని సంతోషించడానికి లేదు — ఇల్లు పూర్తవక ముందు పంపు మీటర్ పద్ధతిమీద ఇచ్చారు. ఇల్లు పూర్తయి పన్నులు చెల్లిస్తున్నా మీటర్ మాత్రం తీయలేదు — అది వున్నంతకాలం నీళ్ళుకూడా లీటర్ల లెక్కన కొనుక్కుంటున్నట్టే — తెనాలి రామలింగడి మోటు కథలా ఈ మేసే గాడిదకన్నింటికీ మీటర్ వెయ్యడానికి మేత వెయ్యాలి. తియ్యడానికి మేతవెయ్యాలి— మేత వేసినా పని అవుతుందా అంటే అబ్బే! తిని ఆయాసంగా పడుకుంటాయి'' అని ఆగి, పరమహంస వంకచూసి — ''అదీ సంగతి నాయనా — ఇది విన్నాక కూడా ఈ వూరి ప్రజలు అదృష్టవంతులేనని నువ్వంటావా'' అన్నాను, విక్రమార్కుడి మార్కు సింహాసనంలో ముళ్ళవూడిలా.

''కష్టమేమరి ! మొత్తానికి యిల్లు కట్టి చాలా బాధలు పడ్డానంటావ్.'' అని విషయాన్ని తేల్చేశాడు పరమహంస.

''అబ్బే — కూర్చుని రెండు చేతులా ఆర్జించడమంటే ఏమిటో, తాగే నీటిక్కూడా యిబ్బంది పడ్డమంటే యేమిటో చెప్పానంతే! 'సొంత డబ్బా కొంతమానుకుని ఎదుటివాడికి సాయపడవోయ్' అన్నారు పెద్దలు — మరి నా డబ్బా అయింది. నీ మృదంగం వాయించు'' అన్నాను - తేలిగ్గా నవ్వుకుని లేచాం.

''మరి మా యింటికి రాకుండానే వెళ్లిపోతావా'' అన్నాను నడుస్తూ.

''నాకూ రావాలనే వుంది. కానీ ఈ మారు కుదరదేమో. వచ్చేనెల్లో తప్పకుండా కలుస్తాను.'' అని అడ్రసు తీసుకున్నాడు.

రోడ్డుమీదికొచ్చాక స్కూటర్ స్టార్ట్‌చేస్తూ, ''రేపు మధ్యాహ్నం మీరు మున్సిపల్ ఆఫీసుకోమారు రాకూడదూ'' అన్నాడు జోగారావు.

''ఎలాగూ రావాలి. మీ కెవరైనా తెలుసునేమిటి ?'' అన్నాను ఆత్రుతగా —

''మీరు రండి. చూద్దాం'' అని, పరమహంస వంక చూశాడతడు —

'వెళ్ళు మరి ! వసుదేవుడంతటివాడికి తప్పలేదు' అన్నట్టు నా వంక చూశాడు పరమహంస.

నా కళ్ళు మెరిశాయి. గుడ్‌నైట్ చెప్పి బస్‌స్టాప్‌వైపు దారితీశాను

మర్నాడు మధ్యాహ్నం ఆఫీసునుండి ఓ గంట ముందుగా బయల్దేరాను — జోగారావు ఎవరితోనైనా చెప్పి యేమైనా సాయం చేయకపోతాడా అనే ఆశ కలిగింది. ఏ పుట్టలో ఏ పాముందో ! ఏ రేటెంటుందో! ఆలోచించుకుంటూనే మున్సిపల్ ఆఫీసులోకి అడుగుపెట్టాను.

బయట ఎక్కడా జోగారావు కన్పించలేదు — బహుశ నన్ను రమ్మన్న సంగతి అతను మర్చిపోయి వుండొచ్చు. 'అయినా అతనెవరో తనెవరో ?' అన్పించింది — నా కాళ్ళు అలవాటు ప్రకారం గుమాస్తా టేబిల్ దగ్గరకు తీసుకువెళ్ళాయి —

''రండి. మీ కోసమే చూస్తున్నాను'' అంటూ కుర్చీచూపించి ఫైలు తీశాడతను —

ఎప్పుడూ మనిషిని చూస్తేనే చిటపటలాడే గూని గుమాస్తాయేనా యితనూ అన్పించింది — బహుశ జోగారావే యేదో చెప్పించివుండొచ్చు అనుకుని వూరుకున్నాను.

''మీ వర్కార్డరుమీద సంతకాలయ్యాయి. మీ అడ్రసు చెబితే ఫిట్టర్ వచ్చి పనిచేస్తాడు'' అని ప్యూన్‌ని కేకేసి ఫిట్టర్ని పిలిపించాడు.

అతనికి గుర్తులు చెప్పి ఇంటికి బయల్దేరాను.

జోగారావుగారు పూనుకోకపోతే ఈ పని మాత్రం ఇంత త్వరగా పూర్తయ్యేది కాదనిపించింది నాకు.

ఇంటికెళ్ళిన కాస్సేపటికే హెల్పర్‌ని తీసుకుని ఫిట్టరొచ్చాడు. వస్తూనే ''అయ్యగారు మీకీ కవరిమ్మన్నారు !'' అంటూ ఓ కవరందించాడు. అతికించిన ఆ కవరుమీద న పేరు రాసివుంది.

''ఎవరూ !'' అన్నాను ఆశ్చర్యంగా.

''మా ఇంజినీరుబాబుగారు !'' అన్నాడతను.

లోపలికి వెళ్ళి కవరు విప్పాను.

ఉత్తరం; దాంతోపాటు రెండు వందరూపాయల నోట్లూ.

రాజేశ్వరరావుగార్కి —

''అవినీతి అన్నది చీడపురుగు లాంటిది — దాన్ని మీవంటివారే ప్రోత్సహిస్తే అది రూపుమాసేదెప్పుడు? క్రిందివారికి లంచమిచ్చి పని జరిపించుకునే కంటె పై అధికారులను చూసి మీ యిబ్బందులను వివరించి వుంటే పనులు త్వరగా జరిగివుండేవి.

ఏమైనా మీకు యిబ్బందే కలిగింది. మీ పని కోసం మా సిబ్బందికి ఎరచూపిన పైకాన్ని మీకు తిప్పి పంపుతున్నాను—స్వీకరించండి. వీళ్ళీ కలుద్దాం.

— జోగారావు.'' ★



# క్రొత్తగా వచ్చాయి!




## ఒక తరం ఆలస్యమయినా వచ్చేశాయి!!

అవునమ్మా ! నిజంగానే !! కావాలంటే మీ పెద్దవాళ్ళని అడిగి చూడండి ! ఇంట్లో పెట్టుకునే ఊరగాయలు ఎంత రుచిగా ఉంటాయో అంతరుచిగా జయ ఊరగాయలు కూడా వుంటాయని వాళ్ళు చెబుతారు.

కారణం ఏమిటో తెలుసా? జయఊరగాయలు మాత్రమే సాంప్రదాయంగా ఇంట్లో పెట్టుకున్నట్టు చేతితోనే తయారు చేయబడ్డాయి. ఇందులో రెండు రకాల కారప్పొడి కలసి వుంది. ఒక పొడి రంగునిస్తే మరో పొడి ఘాటైన రుచి నిస్తుంది. అంతేగాక ఇతర దినుసులు కూడా సరియైన పాళ్ళలో నైపుణ్యము, అనురాగము మేళవించి కలిపేరు.

అందరికీ నచ్చే జయ - అందరూ మెచ్చే ధర, 500 గ్రాముల మామిడికాయ పచ్చడి సీసా రు. 9-75* మాత్రమే. 1 కిలో పెద్ద సీసా రు. 14-75.* ఆదాకు అసలు పేరు జయ.

ఆవకాయ, నిమ్మకాయ, వెల్లుల్లి, పచ్చిమిరప, కొబ్బరి, కలగలుపు కూరగాయలు, మామిడి క్రొత్త రకాలకు పెట్టింది పేరు జయ !

* అమలులోవున్న ప్రకారము స్థానిక పన్నులు అదనము.

**jaya PICKLES**

**జయ ఊరగాయలు**

తొలివలపు ఎంత రసవత్తరంగా ఉంటుందో అంత రమ్యంగా ఉంటుంది జయ

తయారు చేయువారు :
సంజాస్ నైస్ ఫుడ్స్ అండ్ గూడ్స్
(ఇండియా)
1-10-72/6, బేగంపేట మెయిన్‌రోడ్డు,
హైదరాబాదు-500 016

ASSOCIATED/SNF/224T

(గత సంచిక తరువాయి)

కౌరవసభలో జరిగిన సర్వవిషయాలు కొలువుతీర్చియున్న ధర్మరాజుకు తెలియ చెప్పాడు శ్రీకృష్ణుడు.

అయితే కృష్ణా! యుద్ధం తప్పదన్న మాట. దీనికి కురు వృద్ధులు అంతా అంగీకరించినట్లేనా?

ధర్మరాజా! నేనూ, నారదాది మహా మునులూ, కురువృద్ధులూ కలిసి ఎంత హితవు చెప్పినా మదాంధుడైన దుర్యోధనుడు పెడ చెవిని పెట్టాడు. అపైన రాయబారినైన నన్ను కూడా బంధింప తలపెట్టాడు. యుద్ధం అనివార్యమే

అయితే మన ప్రయత్నాలు మనం చెయ్యాలి... మన సర్వ సైన్యాధిపతిని నిర్ణయించుకుందాం

నకుల సహదేవులు......

అన్నయ్యా! బలపరాక్రమ సంపన్నుడూ మనకు ఆశ్రయ దాత అయిన విరాట రాజును నియమిస్తే బాగుంటుంది.

అన్నయ్యా! ద్రుపద మహా రాజు అయితేనో?......

అన్నయ్యా! వ్యూహరచనలో అసమానుడైన ధృష్టద్యుమ్నుడు గాని, అతనికి సాటియైన శిఖండి గాని, ఇందుకు తగినవారని నా అభిప్రాయం

అర్జునా! ఈ విషయంలో మన అభిప్రాయం కన్న శ్రీకృష్ణుని నిర్ణయం మనకు విజయం చేకూరుస్తుంది.

ధర్మరాజా! మనవారందరూ అందుకు తగినవారే. అయినా, అర్జునుడు చెప్పినట్లు వివిధ వ్యూహ నిర్మాణ నిపుణుడు ధృష్టద్యుమ్నుడే సర్వ సైన్యాధిపతి కాదగినవాడు.......

అవశ్యం. అపైని అక్షౌహిణీ నాయకుల్ని కూడా నీవే నిర్దేశించాలి.

సైన్యం ఉన్నవారూ లేనివారూ అనక అందుకు తగినవారిని ఎంచి చెప్తాను, విను.

ద్రుపదుడూ, విరాటుడూ, సాత్యకీ, జరాసంధుని కొడుకు మాగధ సహదేవుడూ, చేకితానుడూ, శిశుపాలుని కొడుకు ధృష్టకేతుడూ, శిఖండి వీరిని అక్షౌహిణీ నాయకులుగ అభిషేకించు.

[ఇంకా ఉంది]



తమ పిల్లల పౌష్టిక ఆహారం
గురించి తల్లులు బాధపడుతుంటారు.

అయితే సుచిత్రకు ఆ చింత లేదు...

"ఎందుకంటే, నేను మా పిల్లలకు రోజూ హార్లిక్స్
ఇస్తాను. హార్లిక్స్ ఇమ్మని డాక్టరు చెప్పినప్పటినుంచి,
ప్రతి రోజూ హార్లిక్స్ త్రాగటం మా పిల్లలకు
అలవాటు చేసాను. హార్లిక్స్ రోజంతా వారిని
ఆరోగ్యంగా, చలాకీగా ఉంచుతుందని
నాకు తెలుసు.

**మీ పిల్లలకు మీరు కూడా**
**హార్లిక్స్ ఇస్తారు. అవును కదూ...?"**






"హార్లిక్స్ ప్రధాన పుష్టిదాయక సారవం.
పుష్టిదాయకమైన ఆహార పదార్థాలతో అద్భుతంగా
దాన్ని రూపొందించారు. హార్లిక్స్ ఏళ్ళ తరబడి
నిరంతరంగా సత్ఫలితాలను చూపిస్తోంది. మీ కుటుంబ
సభ్యుల ఆరోగ్యం కాపాడేందుకూ, వారు
ఏరోజుకారోజు చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను
చేస్తున్నాను."



# హార్లిక్స్
## మంచి పుష్టికరమైనది

Hx-6082 Tel

# ధర్మపథం  చంద్రుడు చేసే ఉపకారం — బులుసు వేంకటరమణయ్య

నవగ్రహాలలోనూ సూర్యుడూ, చంద్రుడూ మనకు మహోపకారం చేస్తున్నారు. సూర్యుడు ఎన్ని విధాల ఉపకరిస్తున్నదీ అందరికీ తెలుసును. ఆ సూర్యుడు ప్రత్యక్ష దైవమని అంటారు. చంద్రుడు చేసే ఉపకారాలను గురించి తెలుసుకోవడమున్నూ అవసరమే.

చంద్రుడు సూర్యునిపైనే ఆధారపడి ఉంటాడు. సూర్యుని సుషుమ్న అను రశ్మి చంద్రుణ్ణి తృప్తి పరుస్తూ, ఉంటుంది. చంద్రుడు షోడశ కళా ప్రపూర్ణుడు. పున్నమినాడు అతనికి పదహారు కళలూ ఉంటాయి. కృష్ణపక్ష పాడ్యమి మొదలు రోజుకు ఒక కళ తగ్గిపోతూ ఉంటుంది. అతడు అమృతమయుడు కాబట్టి ముప్ఫయి మూడువేల మూడు వందల ముప్ఫయి ముగ్గురు దేవతలు అతని అమృతాన్నితాగుతూ అతని కళలను క్షీణింప జేస్తారు. చతుర్దశితో పధ్నాలుగు కళలు పోతాయి. అమావాస్య నాటికి రెండే కళలుంటాయి. రెండు కళలు మాత్రం మిగిలిన చంద్రుడు ఆనాడు సూర్య మండలాన్ని ప్రవేశిస్తాడు. 'అమ' అను రశ్మిలో ఉండడంవల్ల నాటి దినం "అమావాస్య" అయింది. ఆ దినమంతా చంద్రుడు జలంలో ఉంటాడు. తర్వాత వృక్షాలలోనూ, లతల్లోనూ ప్రవేశిస్తాడు. అందువల్ల ఆనాడు చెట్లు ఆకులను, తీగలనూ తుంచకూడదు. తుంచితే బ్రహ్మహత్యా పాతకం వస్తుందని—

"ఛినత్తి వీరుధో యస్తు
వీరుత్సంస్థే నిశాకరే,
పత్రం వా పాతయ త్యేకం
బ్రహ్మహత్యాం స విందతి॥"

అనే శ్లోకం వల్ల తెలుస్తున్నది.

అమావాస్యనాడు అపరాహ్ణ సమయంలో చంద్రుని ఒక కళను (పదిహేనవ కళను) త్రాసి, ఆ మాసం సంపూర్తిగా తృప్తి పడతారు. పితరులను తృప్తి పొందించే దినం కాబట్టి, అమావాస్య పితరులకు ప్రీతికరమైన దిన మయింది. నాడే పితృ తర్పణం చెయ్యడానికి ఇదే కారణం. శుక్ల పక్షంలో క్రమంగా సూర్యుడు చంద్ర కళలను వృద్ధి చేస్తాడు.

కృష్ణ పక్షంలో మిగిలిన పధ్నాలుగు రోజులూ సౌమ్యులు, బర్హిషదులు, అగ్నిష్వాత్తులు అనే మూడు విధాలుగా ఉన్న దేవతలు చంద్ర కిరణాలను ఆహారంగా గ్రహించి తృప్తి పడతారు. చంద్రుడు నీటి పరమాణువులతో కూడిన చల్లని కిరణాలను ప్రసరింపజేసి, ఓషధులను, వృక్షాలను పోషిస్తాడు. వాటివల్ల పశు, పక్షి, కీటకాల పోషణ జరుగుతుంది. మానవుల జీవనానికి వృక్షములు, జీవౌషధులు ఆధారమవుతున్నాయి. శీతాంశువు తన చల్లని వెన్నెలతో సకల ప్రాణులనూ ఆనందింపజేస్తాడు.

ఈ విధంగా దేవతలను, పితృదేవతలనూ, భూమిపై ఉన్న సకల ప్రాణులను పోషిస్తూ ఆనందాన్ని కలిగించే చంద్రుని ఉపకారం వర్ణనాతీతం.

అమావాస్యనాడు పితృ తర్పణం ఎందుకు చెయ్యాలి? అనే సందేహం ఉన్నవారికి ఇందులో సమాధానం ఉన్నది.

---

చారు! నేను మీకు ఏమి అపకారము చేశాను!" అంది వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ.

"హరితా!" అతని కంఠం ఒక్కసారి మృదువుగా మారిపోయింది.

"కన్నెగా ప్రతీ ఆడపిల్లా ఎన్నో కలలు కంటుంది. ఊహల ఉయ్యాల్లో ఊగుతూ, మురిసిపోతుంది. కాబోయే భర్తని, రూపం తెలియని వ్యక్తిని గుండెల్లో నిలుపుకుని ఆరాధిస్తుంది. ఆ వూహాలే రూపం దిద్దుకుని, కళ్లెదుట నిలిచిననాడు, ఆ సుందరమూర్తిని ప్రాణానికి ప్రాణంగా ఎంతగా ప్రేమిస్తుందో ఎవ్వరూ వర్ణించలేరు." అంటూ వెక్కివెక్కి ఏడ్వసాగింది.

"నాకు మీపై ఎంత ప్రేమ వుందో నా గుండెలు చీల్చి చూస్తే మీకు తెలుస్తుంది." అంటూ అలా ఏడుస్తూనే వుంది.

కృష్ణసుమంత్ మనసు అంతా జాలితో నిండిపోయింది. మంచంమీద నుంచి లేచి ఆమె దగ్గరకు వెళ్లి, సోఫాలో పక్కన కూర్చుని, "హరితా!" అంటూ ఆమె భుజాలపై చేతులువేసి మృదువుగా పిలిచాడు.

## మువ్వల పందిరి

(10 వ పేజీ తరువాయి)

చేతుల్లో ముఖం దాచుకుని రోదిస్తున్న ఆమె పలకలేదు. తలఎత్తి చూడలేదు.

"హరితా! నువ్వు అంటే నాకు యెంత యిష్టమో నీకు వేరే చెప్పాలా!"

"హుం ఇష్టం! ఇంకా ఏందుకండీ నన్ను నమ్మింపాలని చూస్తారు!" దుఃఖంలో కంఠం పూడుకుపోయింది.

"హరితా! నువ్వు నా ప్రాణానికి ప్రాణం. నన్ను నమ్మలేవా? ఇలా కళ్లల్లోకి ఒకసారి చూడు. ఆ కళ్లే నీకు చెపుతాయి నువ్వు అంటే నాకు ఎంత ఇష్టమో! నా కళ్లల్లో వెలిగే కాంతి అవి నీ ప్రేమ జ్యోతులే! నా కళ్లల్లో మెరిసే మెరుపు నీ అనురాగ కిరణాలే!"

"ఇక చాలు, ఆపండి. నేను వినలేను." అంటూ చేతులతో రెండు చెవులూ మూసుకుంది.

"హరితా!"అంటూ హతాశుడై చూశాడు.

"మీ మాటలు ఇంకా నమ్మి మోసపోనండి! మీ కళ్లల్లో మెరిసే మెరుపు మన మమతానురాగాలకి హారతులు అనుకున్నాను. మీ కళ్లలో వెలిగే కాంతి కిరణాలు మన దాంపత్య జీవితానికి వెన్నెల దీపాలు అనుకున్నాను. అనుకుని మురిసిపోయి, పొంగిపోయాను. తరువాత తెలిసింది, పురుషుడి మనసు చంచలమైనది అని. అతనికో మనసు అంటూ వుండదని. ప్రతి స్త్రీ అందచందాలకీ అతని మనసు చలిస్తుంది అని. ప్రతీ స్త్రీ దగ్గరా నువ్వే నా ప్రాణం అనే పాటనే పాడుతూ, ఆమె ప్రేమానురాగాలని జయిస్తాడని నాకు ఇప్పుడు అర్థం అవుతూంది."

"హరితా! నన్ను అందరిలో ఒకడిగా భావిస్తున్నావా! నా మనసు ఏమిటో నీకు ఇంకా తెలీదా!" బాధగా చూశాడు.

"ఏం! మీరు మాత్రం ఎక్కువా! ఆ అందరిలాంటి వారే మీరూనూ! మీ గురించి పెళ్లి కానప్పుడు ఎంతగాఊహించాను అంటే— ఉన్నతమైన విశాల భావాలు, మానసాతీత

## మువ్వల మురళి

మైన ఉత్తమ గుణాలు వున్నాయని ఊహించి పిచ్చిదాన్ని అయ్యాను. ఇప్పుడు! ఇప్పుడు తెలిసింది మీరూ అందరిలాంటి మామూలు మనిషే అని. ఈ నిజం తెలుసుకున్న నాడు, నా ఊహలే నన్ను వెక్కిరించాయి.'' అంటూ మళ్ళీ చేతుల్లో ముఖం దాచుకుని కుమిలి కుమిలి ఏడ్వసాగింది.

కృష్ణమూర్తి లేచి వెళ్ళి గది తలుపులు మూసి వచ్చి, ఆమెను తెచ్చి మంచం మీద పడుకోబెట్టి, లైటు ఆర్పేసి ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

దుఃఖంతో, రోషంతో అతన్ని విడిపించుకోవాలని పెనుగులాడింది. అతను వదలలేదు.

"హరితా! నీ మెడలో తాళి కట్టి, నీకు అన్యాయం చేస్తానని ఎలా వూహించావు. నువ్వు నమ్ము నమ్మకపో! నువ్వు నా ప్రాణానికి ప్రాణానివి'' అంటూ ఆమెను కోరికతో గుండెలకు హత్తుకున్నాడు. అతనికి ఇక ఎదురు తిరిగే శక్తిలేక అతని చేతుల్లో ఒదిగిపోయింది.

## 34

కృష్ణమూర్తి మామూలుగా భార్యతో మాట్లాడేస్తున్నా, హరిత మాత్రం మనసు విప్పి మాట్లాడటం లేదు. ముభావంగానే వుంటోంది. అతను ఇంటి దగ్గర లేనప్పుడు రోజా హరితను స్నేహ పూర్వకంగా పలకరించబోయింది. రోజాని చూస్తేనే హరిత, అసహ్యించుకున్నట్టుగా ముఖం తిప్పేసుకుంది. ఆమె చిన్నబుచ్చుకున్నట్టుగా అయింది.

ఆ రోజు అంతా ఆమె అలా దిగులుగానే వుంది. ఈల దువ్వుకో లేదు. ముస్తాబు అవలేదు.

కృష్ణమూర్తి ఇంటికి వచ్చాక, రోజా అదోలా వుండడం గమనించి అడిగాడు–

"ఏమిటి అలా వున్నావు! హరిత నిన్ను ఏమైనా అన్నదా ?''

లేదన్నట్టు తల తిప్పింది.

"మరి?'' ప్రశ్నార్థకంగా చూశాడు.

"వూరికే, నాకే మనసు బాగుండక అలా వున్నాను.'' అంది మెల్లగా.

అప్పుడు తన తప్పు ఏమిటో తెలిసి వచ్చింది. తను ఉదయం వెళ్ళి సాయంత్రం వస్తాడు. హరిత ఆమెతో మాట్లాడదు. రోజా ఒక్కర్తే ఆ గదిలో కూర్చుని గంటలు

# ఆమె పట్టుబడింది

సాధారణంగా మనం చేయని తప్పు ఏదైనా మరో వ్యక్తి గనుక చేస్తే, ఆ వ్యక్తిని మనం చిన్నచూపు చూస్తాం. అంతకంటె పెద్ద తప్పే గనుక ఆ వ్యక్తి చేస్తే, ఆ వ్యక్తి శీలాన్ని హత్య చేసే హంతకుల మయ్యేందుకు గూడ వెనుకాడం. అక్షరాల అవతలి వ్యక్తి చేసిన తప్పు మనం చేయనంతవరకు మనమేదో మహానుభావులమై పోయినట్టు ఫీలవుతాం. సరిగ్గా అట్లాంటి తప్పు మాత్రం చేయలేదన్న మాటేగాని, అంతకు మించింది మరేదో తప్పు చేస్తూనే ఉంటాం. మన కంటిలో దూలం అలాగనే అట్టిపెట్టుకొని, అవతలివారి కంటిలో నలుసును వ్రేలెట్టి చూపెట్టినట్టుగా ఉంటుంది.

జారిణిగా పేరెక్కింది ఒకామె. ఆమె పేరు తెలియదు. తెలియాల్సిన అవసరమూ లేదు. ఆమె పట్టుబడింది సమాజం ఆమెను ఓరకంట చూచింది. ఏవగించుకొంది. ఆ సమాజమేదో మడి కట్టుకొని కూర్చున్నట్టు. ఇతరత్రా నైతికంగా పతనమైన ఆ సమాజంలోని పెద్దమనుషులంతా "ఆమెను" చరచరా రెచ్చబండకు యీడ్చుకొచ్చారు. "ఈ నీచురాలని రాళ్లతో కొట్టి చంపమంటోంది మీ ధర్మం, మరి నీవేమంటావు స్వామీ ?" వ్యంగ్యంగా అడిగారు అక్కడే ఉన్న ఓ గురువును, విషపు చూపు చూస్తూ. ఆయన సరే అలానే కానివ్వండి అంటే ఆయనకు మానవత్వం లేదవాలనీ, అభ్యంతరం చెబితే ధర్మ విరోధి అనాలనీ వారి ఉబలాటం. వారు చేస్తోన్న అపచారం గుర్తించడంలేదు ఆ గువిందలు.

అంతవరకు మౌనముద్ర వహించిన ఆ గురువు తలవంచి, నేలమీద వ్రేలితో అలా అలా నింపాదిగా రాస్తున్నాడు ఆ రాతను చూచినవారంతా ఒక్కరొక్కరే అక్కడ్నుండి నిష్క్రమిస్తున్నారు. "మీలో పాపం లేనివాడు ఆమెమీద మొదటి రాయి విసరండి" అని రాస్తున్నాడా మహాగురువు. పెద్దపులుల మధ్య మేకపిల్లలా నిలువబడ్డ ఆ జారిణి మెల్లగా తలెత్తి చుట్టూ కలియజూచింది. ఒక్కరూ లేరు. వారి ధర్మం ప్రకారం ఆమెను రాళ్లతో కొట్టగల అర్హత ఉన్న పాపి రహితుడు అక్కడ ఒక్కడే ఉన్నాడు. ఆయనే గురువు. ఆయన ఆమెను చిన్నచూపు చూడలేదు. కాని సూటిగా ఆమె కళ్లలోనికి చూచాడు. ఆ చూపులోని కరుణ, జాలి ఆమె హృదయపు లోతులను స్పృశించాయి. పరివర్తనతో ఆమె హృదయం ప్రకంపించింది. "అమ్మా వెళ్ళు, యింకెప్పుడు పాపం చేయకు" అంటూ స్వామీ నోటనుండి వెలువడిన అమృత వాక్కులు ఆమెను మళ్లీ మనిషిని చేసాయి. ఇప్పటికీ ఏ మనిషినైనా అలానే ఆప్యాయంగా క్షమించే మహా గురువు ఆయన. ఆయనే యేసు ప్రభువు.


**డా॥ ఎస్. జాన్ డేవిడ్**

**ఎ. ఎం. జి. ఇండియా**

వార్తాపత్రికల శుభ సందేశాలు

పోస్టు బాక్సు నెం. 1820 :: ముషీరాబాద్

హైదరాబాదు - 500020. (ఆంధ్రప్రదేశ్)

గంటలు గడుపుతూంది. ఒంటరిగా వుంటే ఆలోచనలు చుట్టుముట్టవూ!

"ఏదైనా సినిమాకు వెళ్దామా ?"

"ఈ రోజా !"

"సెకండ్ షోకి."

"మరి హరితగారు!" సందేహంగా చూసింది.

"తననీ తీసుకు వెళ్దాం."

రోజా 'అలాగే' అంటూ తల వూపింది.

భార్యను సినిమాకు బయలుదేరమని చెప్పాడు.

హరిత భర్తవైపు విస్మయంగా చూసింది అర్థం కానట్టు. తను ఎప్పుడైనా సినిమాకు వెళ్దామని అనుకుంటే నాలుగు రోజులు ముందు నుండీ అడుగుతుంటే తీరిక చేసుకుని అప్పుడు తీసుకువెళ్లేవాడు. ఇప్పుడు అతనికై అతను అడుగుతుంటే వింతగా వుంది.

"ఏమిటి అలా చూస్తావు! సినిమాకు వెళ్దాం పద."

హరిత మాట్లాడలేదు.

"రోజా, నువ్వూ, నేనూ అంతా కలిసి వెళ్దాం."

ఆ మాట వినటంతోనే ముఖం తిప్పుకుంది.

"నేను రాను."

"ఏం ?"

"దానితో నేను చచ్చినా రాను. అలాటి బజారు స్త్రీతో కలిసి వెళ్తే పరువు ఏమైనా నిలుస్తుందా!"

"హరితా!" అన్నాడు కంగారుగా, ఆ మాటలు రోజా ఎక్కడ వింటుందో అన్నట్టు.

"ఏం! ఎందుకు! వున్నమాట అంటే తప్పా! ఎవర్ని అడిగినా ఆ మాటే చెప్తారు. మనిషిని చూడగానే తెలుస్తుంది ఎవ్వరికైనా" అంది రోషంగా.

ఆ మాటలు వింటూనే కృష్ణసుమంత్ ముఖం కోపంతో జేవురించింది.

"నోర్ముయ్" అతని కంఠం కంగుమంది.

"మళ్లీ నోరు పైకి లేచిందో చంపేస్తాను జాగ్రత్త!" పళ్ల బిగువున కోపం ఆపుకుంటూ అరిచాడు.

"నన్ను చంపేదాకా వచ్చారన్న మాట. చంపేయండి. చంపేస్తే పీడాపోతుంది. రోజా రోజుకి సగం సగం చస్తూ బ్రతికే కంటే ఒక్కసారే మీ చేతుల్లో చచ్చిపోవడం మంచిది. ఆలోచిస్తారే! ఊఁ! కానివ్వండి. మీకున్న అడ్డు

# మువ్వల మురళి

తొలగించేయండి" అంటూ ఆవేశంలో అరిచింది.

కృష్ణసుమంత్ భార్యవైపు రెప్పవాల్చకుండా చూశాడు. అతను మొట్టమొదటి సారిగా తెలుసుకున్న నిజం ఏమిటి అంటే, ఎంత తెలివయిన లాయరు అయినా, ఎన్ని కేసులు గెలిచినా, తెలివయిన భార్యతో వాదించి ఏ లాయరూ గెలవలేదు. భార్య ముందు ఓడిపోయి, నల్లకోటు తీసి పక్కన పడేసి తల వంచ వలసిందే. ఈ హరితముందు తన లాయర్ తెలివితేటలు అన్నీ ఒక్కసారిగా గాలికి ఎగిరి పోతున్నాయి. ఒక్క మాట మాట్లాడనివ్వటం లేదు. తన 'లా' పట్టాకి విలువ లేకుండా పోతూంది. ఈమె లా చదివితే ఇంకెంత విజ్ఞానం సంపాదించుకునేదో! కృష్ణసుమంత్ మనసులో అనుకున్నాడు.

మరొక విషయంలో అయితే భార్య తెలివితేటలకి మెచ్చుకుని పొగిడేవాడు. ఇప్పుడు పొగిడినా, వేళాకోళం చేస్తున్నాడు అనుకునే ప్రమాదం వుంది.

"ఏమిటి అలా నిలబడిపోయారు కానివ్వండి. మీ చేతుల్లో ప్రాణం వదిలేయటమే మంచిది. ఇంకా బ్రతికివుంటే ఇంకేమి వినవలసి వుంటుందో!"

అతను మాట్లాడలేదు.

"వెళ్లండి, నా అడ్డు మీకు ఏమీలేదు — నేను చచ్చినదానితోనే లెక్క. దాన్ని తీసుకుని మీరు ఎక్కడికి అయినా వెళ్లవచ్చు" అంది రోషంగా.

కృష్ణసుమంత్ ఇంకేమి మాట్లాడలేదు. ఆఫీసురూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

* * *

రాత్రి పదకొండు గంటలు దాటింది.

కృష్ణసుమంత్‌కి నిద్రపట్టలేదు. హరిత గొడవపెట్టటంతో రోజాని సినిమాకు తీసుకు వెళ్దామని తీసుకెళ్లలేదు. హరిత మాటలు ఆమెకు వినిపించే వుంటాయి. గదిలో పడుకుని ఏడుస్తూంది ఏమో!

అతని మనసు మరి ఆగలేదు. పక్కన పడుకున్న భార్యవైపు చూశాడు. బెడ్‌లైటు కాంతిలో ఆమె ముఖం స్పష్టంగా కనిపిస్తూంది.

మంచి నిద్రలో వుంది. చెయ్యివేసి కదిపి చూశాడు. లేవలేదు. నెమ్మదిగాలేచి, లైటు అయినా వేసుకోకుండా గది తలుపులు తీసుకుని, అవతలకు వెళ్లి తలుపులు దగ్గరగా చేరవేసి, రోజా గదివైపు వెళ్లాడు.

గదిలోపల అడుగు పెడ్తూనే, గది తలుపులు గడియ వేసేసాడు!

రోజాకి అతను లోపలకు రావటం తెలీదు. తట్టి లేపాడు "రోజా" అంటూ.

ఉలిక్కిపడి కళ్లు తెరచి చూసిన రోజా "మీరా!" అంటూ మంచం మీద లేచి కూర్చుంది.

ఆమె పక్కన మంచంమీద కూర్చుంటూ అన్నాడు—

"హరిత మాటలకి నువ్వు బాధపడి వుంటావు, అవునా ?"

రోజా మాట్లాడలేదు. ఖిన్న వదనంతో అలాగే కూర్చుంది.

"నాకు తెలుసు, ఆ మాటలు నిన్ను ఎంత బాధించాయో!"

ఒక పావుగంట వరకూ ఆ విషయం

## రష్యా వ్యవసాయ ప్రగతి

సోవియట్ యూనియన్ 1979లో 476,600 ట్రాక్టర్లు, 114,800 ధాన్యం నూర్పిడియంత్రాలు, 28,000 బంగాళాదుంప, పంచదార దుంప, మొక్కజొన్నను నూర్పిడి చేయగల కంబైన్ నూర్పిడి యంత్రాలను 9,000 ప్రత్తి నూర్పిడి యంత్రాలు, 11,500 నీరు చల్లే యంత్రాలను, 544,000 లకు పైగా నాగళ్లను, జడ్డిగాలను, సేద్యపు పరికరాలను ఉత్పత్తి చేసింది.

ప్రస్తుతం 47 రకాల ట్రాక్టర్లు, 650కి పైగా వివిధరకాల వ్యవసాయ యంత్రాలు ఉత్పత్తిలో వున్నాయి. ప్రస్తుత పంచవర్ష ప్రణాళిక నాలుగు స్సర సంవత్సరాలలో 235 కొత్త, ఆధునిక, సాంకేతిక సౌకర్యాల నమూనాలు రూపొందించబడి, వీనిలో 200 పరికరాలు ప్రయోగిక వ్యాపార పద్ధతిపై ఉత్పత్తి ప్రారంభించబడినాయి.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. -సం.

## ప్రధానమంత్రి 20 అంశాల కార్యక్రమం

# లక్షలాది కష్టజీవులకు వరప్రసాదం

ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ ప్రకటించిన 20 అంశాల ఆర్థిక కార్యక్రమం, వాస్తవానికి ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి సుస్థిరమైన ప్రగతికి సంకేతం. ఇది బడుగు వర్గాల అభివృద్ధికి జరుపుతున్న కృషిలో నూతన అధ్యాయాన్ని ప్రారంభించి, లక్షలాదిమంది బలహీనవర్గాల ప్రజలలో కొత్త ఆశలను చిగురింపజేసింది.

## వాస్తవాలే ఇందుకు దర్పణం రికార్డుస్థాయిలో ఆహారోత్పత్తి

1978–79 లో రికార్డుస్థాయిలో 106.6 లక్షల టన్నుల ఆహారధాన్యాలను ఉత్పత్తి చేశారు. తుఫాను, దుర్భిక్ష పరిస్థితులు ఏర్పడినప్పటికి తాత్కాలిక ప్రణాళికలను త్వరితగతిని అమలుజరపడంతో 79–80 లో కనీసం 70 లక్షల టన్నుల మేరకు ఉత్పత్తి సాధించగలిగారు.

## ప్రజలకు చౌక వస్త్రాలు

అరవై శాతం మంది చేనేత పనివారలను సహకార పరిధిలోకి తెచ్చారు.

1977–78 లో 189 లక్షల చదరపు మీటర్ల చౌక వస్త్రాలను ఉత్పత్తి చేయగా 1978–79 లో 2.3 లక్షలు 1979–80 లో 330 లక్షల చదరపు మీటర్ల చౌక వస్త్రాలను ఉత్పత్తిచేసి ఇప్పుడు 388 కేంద్రాల ద్వారా ప్రజలకు పంపిణీ చేశారు.

## చౌకధర దుకాణాల ద్వారా అత్యవసర సరుకులు

ఇప్పుడు 22,009 చౌక ధర దుకాణాల ద్వారా ప్రజలకు అత్యవసర సరుకులను సరఫరా చేస్తున్నారు.

## భూసంస్కరణలు

రాష్ట్రంలో భూసంస్కరణలను తీవ్రతరంగా అమలుజరుపుతున్నారు. ఇందువల్ల 3.79 లక్షల ఎకరాల మిగులు భూమిని స్వాధీనం చేసుకున్నారు. 1,74,125 కుటుంబాలకు భూమి పంపిణీ చేశారు. వారిలో చాలావరకు షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన తరగతుల వారు ఉన్నారు.

## బలహీనవర్గాలకు ఇళ్లు

ఈ పథకాన్ని ద్విగుణీకృతోత్సాహంతో అమలుజరుపుతున్నారు. 2.5 లక్షల కుటుంబాలకు 5,000 కొత్త వాడలలో వసతి కల్పించారు. 12 లక్షల పేద కుటుంబాలకు ఇళ్ల స్థలాలు కేటాయించారు.

గురించే మాట్లాడుతూ, ఆమెకు ధైర్యం చెప్పాడు— 'బాధ పడొద్దు' అని.

## 35

రాత్రి ఆమె గదిలోంచి వచ్చి పడుకునే సరికే సరిగ్గా ఒంటిగంట అయింది.

హారితకు అసలు ఆ విషయమే తెలియదు.

కృష్ణసుమంత్ తెలిగ్గా ఊపిరి తీసుకున్నాడు, భార్యకు తెలియలేదని.

ఆ రోజు ఉదయం ఆఫీస్ రూమ్‌లో కూర్చుని సెక్రటరీకి లెటర్ డిక్టేట్ చేస్తున్నాడు. అతను వ్రాస్తున్నాడు. వ్రాయటం అయిపోయాక, ముందు రోజు టైపు చేసిన లెటర్స్ తెచ్చి అతని ముందు వుంచాడు సెక్రటరీ. కృష్ణసుమంత్ ఆ లెటర్స్ ఒకసారి చదివేసి, అన్నిటిమీద సైన్ చేసేసి, ఆ రోజు అతను చెయ్యవలసిన పనులు చెప్పేసి అక్కడనుండి క్లర్క్ టేబుల్ దగ్గరకు వెళ్ళి, తనకు కావలసిన ఫైల్ ఒకసారి చూసి, కేసుకు సంబంధించిన విషయాలు ఏవో అతనికి రెండు మాటలు చెప్పి, లోపలకు వచ్చేసి, డ్రస్సు మార్చుకుని, దువ్వెన తీసుకుని తల దువ్వుకుంటుంటే గుర్తువచ్చింది—తలకి క్రీమ్ రాసుకోలేదు అని. భార్యను పిలిచి తలకి క్రీమ్ రాయమన్నాడు. హారిత ఒక్కసారి భర్తవైపు కోపంగా చూస్తూ—

"ఏం! ఆవిడగారు ఏమైంది? ఆవిడ్నే పిలవండి" అంది అక్కడ నిలబడకుండా.

కృష్ణసుమంత్ క్షణంసేపు ఏం మాట్లాడలేదు. తనలోతాను ఏదో ఆలోచించుకున్నట్టు తల పంకించి, రోజా! అంటూ పిలిచాడు.

'పిలిచారా' అన్నట్టు భయంగా గదిలో అడుగు పెట్టింది రోజా.

హారిత కళ్ళు అటే వున్నాయి. తను రుసరుసలాడుతూ ఇవతలకు వచ్చేయగానే భర్త రోజాని పిలవటం, ఆమె గదిలోకి వెళ్ళటం అంతా చూస్తూనే వుంది.

రోజా గదిలోకి అడుగు పెట్టగానే కృష్ణసుమంత్ రోజాకి చెప్పి గది తలుపు దగ్గరకు చేరవేయించేశాడు.

ఆమె అతను చెప్పినట్టే చెయ్యటంతో, హారిత ముఖంమీద తలుపులు ధనాలున వేసుకున్నట్టు అయి ఆమె హృదయం భగ్గుమంది. గదిలో మాటలు ఆమెకు స్పష్టంగా వినిపిస్తున్నాయి.

# మువ్వల మురళి

"మీరు అలా కూర్చుంటే రాస్తాను — అలా నిలబడితే తలకి క్రీమ్ రాయలేను."

"అబ్బబ్బ!" అంటున్న అతను అక్కడ స్టూల్ కాస్త ఇవతలకు లాగినట్టు చప్పుడు అయింది. అతను కూర్చున్నట్టున్నాడు.

"ఊఁ రాయి!"

కొంతసేపు నిశ్శబ్దంగా వుంది. ఆ తరువాత రోజా "ఆఁ ఆ!" అంటూంది.

"ఆ! ఏం ఫర్వాలేదు" అంటున్నాడు గట్టిగా నవ్వేస్తూ.

"అబ్బబ్బ! నా చీరకు అంతా క్రీమ్ అంటుకుపోయింది."

"చీర మార్చేయ్!"

"ఊఁ! మీరు అలా చెప్పకపోతే!" అంటున్న ఆమె సన్నగా నవ్వుతూంది. అతనూ నవ్వుతున్నాడు. హారితకు ఆ మాటలూ, నవ్వులూ వింటుంటే ప్రపంచం అంతా గిర్రున రంగుల రాట్నంలా తిరిగిపోసాగింది. కళ్లనీళ్ళు గిర్రున తిరిగాయి. భర్త తలకి క్రీమ్ రాస్తుంటే అతను వేసే కొంటెవేషాలు తనకి తెలియనివా!

తన గదిలో, తన స్థానంలో, తన భర్త దగ్గర ఆమె!

ఇద్దరూ గదిలో తలుపులు మూసుకుని, ఆయన కొంటె చేష్టలకి ఆమె నవ్వటం!

తల తిరిగిపోసాగింది. కళ్ళు చీకట్లు కమ్మేసి అంతా అలికేసినట్టుగా కనిపించసాగింది. ఒంట్లో శక్తి అంతా ఊదేసినట్టు నీరసం. కాళ్ళు తేలిపోతున్నాయి. అంతే! ఆ తరువాత ఏం జరిగిందో ఆమెకు తెలియలేదు.

హారితకు తెలివి వచ్చాక చూస్తే, గదిలో మంచం మీద పడుకుని వుంది. పక్కన కృష్ణసుమంత్ కూర్చుని తన జుట్టు సవరిస్తూ, చెంపలు నిమురుతూ, తను కళ్ళు విప్పి చూడగానే కాస్త ముందుకి వంగి, "ఎలావుంది?" అడిగాడు ఆత్రుతగా.

హారిత మౌనంగా కళ్ళువిప్పి చూసింది. దూరంగా గుమ్మం దగ్గర రోజా నిలబడి ఆత్రుతగా ఇటే చూస్తూంది.

మళ్ళీ కళ్ళు మూసేసుకుని, ముఖం పక్కకు తిప్పేసుకుంది, భరించరాని బాధతో తనలోతనే కుమిలిపోతూ!

"హారితా!" అంటూ పిలిచాడు.

భర్త పిలుపుకి కళ్ళుతెరిచి చూడలేదు, పలుకలేదు.

భార్య తలని ప్రేమగా నిమురుతూ, "హారితా! ఒంట్లో ఎలావుంది! బాగుందా?"

తల వూపింది, 'బాగానేవుంది' అన్నట్టు కళ్ళువిప్పి చూడకుండానే. కొద్దిసేపు తరువాత కృష్ణసుమంత్ 'కోర్టుకు టైము అయింది' అని భార్యకుచెప్పి, జాగ్రత్తగా చూడమని రోజాకి చెప్పి, వెళ్ళిపోయాడు.

భర్త వెళ్ళిపోయాక తలగడలో ముఖం దూర్చి, గుండెలవిసిపోయేలా ఏడ్చింది హారిత. ఏడ్చి ఏడ్చి కళ్ళు ఎర్రగా, కనురెప్పలు ఉబ్బిపోయి, ముఖం పీక్కుపోయి ఎలాబడితే అలా తయారయింది. ఏడ్వటం వలన ముఖం అంతా ఎర్రబడిపోయింది. ఎన్నో లంఖణాలు



(సశేషం)

# మువ్వల మురళి

చేసినట్టు నీర్సంగా అయిపోయింది. ఆ వేళ భోజనం చెయ్యకుండా అలా పడివుంది.

మధ్యాహ్నం రెండు గంటలు అయింది. గది తలుపులు మెల్లగా తెరుచుకుని రోజా లోపలకు వచ్చింది. హరిత మంచం దగ్గరగా వచ్చి "ఏవండీ!" అంటూ మెల్లగా పిలిచింది.

ఆ పిలుపుకి మెల్లగా కళ్ళు తెరిచి చూసింది. రోజా పండ్లరసం గ్లాసుతో మంచానికి కొద్ది దూరంలో నిలబడి వుంది. ఆమెను చూస్తూనే హరిత ముఖం పక్కకు తిప్పుకుంది.

"ప్రొద్దుటి నుండి మీరు అసలు ఏం తీసుకోలేదు. ఈ జ్యూస్ అయినా తీసుకోండి" అంది బ్రతిమాలుతున్నట్లుగా.

ఆ మాటలతో హరిత ఆమె వైపు తీక్షణంగా చూసింది. "నా సంగతి నీకు ఎందుకు! పచ్చని సంసారంలో చిచ్చుపెట్టావు. నా భర్త అనురాగాన్ని నాకు దక్కకుండా చేసావు. నా యింట్లో నాకు స్థానం లేకుండా చేశావు" అన్నట్టు వున్నాయి ఆమె చూపులు.

రోజా మౌనంగా తల వంచుకుంది, ఆమె చూపులతో తన చూపులు కలపలేనట్టు.

"నేను ఛస్తే నీకు ఎందుకు! బ్రతికితే నీకు ఎందుకు!" తీక్షణంగా చూసింది.

"అదేమిటండీ అలా అంటారు!" అంది చిన్నబుచ్చుకున్నట్టుగా.

హరిత ముఖం కోపంతో జేవురించింది.

"ఈ జ్యూస్ కొద్దిగా తీసుకోండి" అంది మళ్ళీ బ్రతిమాలుతూ.

"నాకేం అక్కర్లేదు. ముందు బయటకు నడు."

"వెళ్ళిపోతాను. మీరు ముందు ఈ జ్యూస్ తీసుకోండి." అంటూ బలవంతంగా గ్లాసు ఆమె చేతికి అందివ్వబోయింది.

"అక్కర్లేదు అని చెప్పానా!" అంటూ కోపంతో మండిపడుతూ చేత్తో విసురుగా ఆ గ్లాసుని తోసేసింది.

అంతే! రోజా చేతిలో గ్లాసు ఒక్క ఎగురు ఎగిరివెళ్ళి గోడకు బలంగా కొట్టుకుంది. గ్లాసులో జ్యూస్ అంతా నేలపాలు అయింది. గ్లాసు ముక్క ముక్కలై, పెంకులు చెల్లాచెదురు అయిపోయాయి. పగిలిన గ్లాసువైపు, చెల్లాచెదురు అయిన పెంకులు వైపు ఇద్దరూ క్షణం అలాగే చూసి, తిరిగి ఒకళ్ళని ఒకళ్ళు సూటిగా చూసుకున్నారు.

హరిత చూపులు కత్తుల్లా, పదునుగా వున్నాయి!

రోజా చూపులు మెత్తగా వున్నాయి!

రోజా మెల్లగా అక్కడ నుండి వెళ్ళి, క్రింద కూర్చుని గాజుపెంకులు అన్నీ ఏరి, అవతలకు తీసుకెళ్ళిపోయి, తిరిగి ఆ గదిలోకి వచ్చి, చీపురుతో గది అంతా ఊడ్చి, తడి గుడ్డతో శుభ్రంగా తుడిచేసి గదిని ఎప్పటిలా తయారుచేసింది.

'రోజా ఆ గదిలోంచి వెళ్ళిపోయింది' అని తెలిసిన తరువాత, కళ్ళువిప్పి చూసింది.

గదిలో పగిలిన గాజుముక్కలు గాని, ఒలికిన జ్యూస్‌గాని ఏమీలేవు. గది అంతా నీటుగా, శుభ్రంగా వుంది. ఇంట్లో అంత మంది నౌకర్లు వుంటే ఈవిడే చెయ్యాలా! అంతా గొప్పకోసం, మెప్పుకోసం. మనసులోనే నిరసనగా అనుకుంది. హరితకు రోజాని పీక నులిమి చంపేద్దామన్నంత కోపంగా వుంది. ఆమెను ఇంట్లోంచి ఎలా తరిమేయటమా అని ఆలోచిస్తోంది.

## 36

రెండు రోజులు తరువాత—

రోజా తన గదిలో కూర్చుని పుస్తకం చదువుకుంటోంది. కృష్ణసుమంత్ సాయంత్రం కోర్టు నుండి వస్తూనే, రోజా! అంటూ పిలుస్తూ హడావుడిగా లోపలకి వచ్చాడు.

"రోజా!" అంటూ ఆమెకోసం వెతుక్కుంటూ గదిలోకి వెళ్ళాడు. అతను గదిలోకి అడుగు పెడుతూనే రోజా లేచి నిలబడింది, 'ఏమిటి! ఏంకావాలి ?' అన్నట్టు చూస్తూ.

"రోజా! నువ్వు ఒక్క పదినిమిషాల్లో, త్వరగా తయారయి నాతో రావాలి" అన్నాడు వరసగా నాలుగుసార్లు చిటికెలేస్తూ.

"ఎక్కడికి! ఎందుకు ?" అడిగింది ఆశ్చర్యంగా.

"చెప్తా తరువాత. ముందు త్వరగా తయారవు. టైములేదు."

రోజా 'అలాగే' అన్నట్టు తల వూపింది.

"నేను ఈ లోగా స్నానంచేసి, డ్రస్ మార్చుకుని, టీ తీసుకుని వస్తాను."

రోజా నవ్వింది. అతను ఆమెకు మరో సారి చెప్పి, వెళ్ళబోతూ ఆగి వెనుతిరిగి చెప్పాడు—

రెండవ డ్రా: 12.10.80.

మొత్తము బహుమతుల విలువ:

రూ. 9,90,000

బహుమతుల మొత్తము : 33,351



# భాగ్యలక్ష్మి

మిమ్ములను వరించబోతోంది

3 సిరీసులకు చేర్చి:

| | | | |
|---|---|---|---|
| 3 మొదటి బహుమతులు | రూ. | 1,00,000/- | ఒక్కొక్కటి |
| 6 రెండవ బహుమతులు | రూ. | 20,000/- | ఒక్కొక్కటి |
| 12 మూడవ బహుమతులు | రూ. | 5,000/- | ఒక్కొక్కటి |
| 30 నాల్గవ బహుమతులు | రూ. | 1,000/- | ఒక్కొక్కటి |
| 300 ఐదవ బహుమతులు | రూ. | 100/- | ఒక్కొక్కటి |
| 3000 ఆరవ బహుమతులు | రూ. | 50/- | ఒక్కొక్కటి |
| 30,000 ఏడవ బహుమతులు | రూ. | 10/- | ఒక్కొక్కటి |

టికెట్ ఖరీదు: రు 1/-

ప్రతి 100 టికెట్లకు 1 బహుమతి

త్వరపడండి! నేడే మీ టికెట్ కొనండి!

విక్రయదార్లు: ఆంధ్రప్రదేశ్ స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్ లి. 5-10-174, ఫతేమైదాన్ రోడ్, హైదరాబాదు-500 004.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ లాటరీ





ఆంధ్రప్రదేశ్ స్టేట్ లాటరీ
[illegible]

బహుమతులు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వముచే గ్యారంటీ చేయబడినవి.

ASP/8/809/TEL

16 వ శతాబ్దమందలి విజయనగర కాలమునాటి లెపాక్షి నంది.

# సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు



## మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు

మీ బట్టలకు కళ్లు తిప్పుకోలేనంత తెల్లదనం—క్రమం తప్పకుండా సూపర్ రిన్‌తో ఉతికితే వాటి తెల్లదనం అద్వితీయం. మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే మరింత తెల్లటి తెలుపునిస్తుంది సూపర్ రిన్. ఎందుకంటే, సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ.




**దీని తెలుపు చేసే శక్తిని మీకు మీరే ఋజువు చేసుకోండి:**

మరే ఇతర డిటర్జంట్ బార్‌తోనైనా ఉతికినది





సూపర్ రిన్‌తో ఉతికినది

సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పాదన

లింటాస్-RIN. 40-2316 TL

"మంచి చీర కట్టుకుని, మొన్న తెచ్చిన ముత్యాల నెక్లెస్ పెట్టుకో!"

'అలాగే' అన్నట్టు తల వూపి, 'ఇంతకూ ఎక్కడికో చెప్పారు కాదు' అన్నట్టు చూస్తూ నవ్వింది.

"అక్కడికి వెళ్ళేక నీకే తెలుస్తుంది. నేను అప్పుడే చెప్పేస్తానా! ఊహుఁ!" అన్నట్టు చూశాడు.

అతని కళ్ళు ఫక్కున నవ్వినట్టు అయ్యాయి.

రోజా ఉడుక్కున్నట్టుగా చూసింది. కృష్ణసుమంత్ నవ్వుతూ ఆమె ముఖంలోకి చూశాడు.

ఆ గదిలోంచి వచ్చేశాడు. అతని మనసు అంతా సంతోషంగా వుంది. ఎన్నడూ లేని ఉత్సాహం అతనిలో ఉరకలు వేస్తోంది.

'రోజా సంతోషమే తన సంతోషం' తృప్తిగా నిట్టూర్చాడు.

కృష్ణసుమంత్ స్నానం చేసి, డ్రస్ మార్చుకుని, పది నిమిషాల్లో తయారయి, నౌకర్ ఇచ్చిన టీ తీసుకుని బయలు దేరాడు.

రోజా వైలట్ జార్జెట్ చీర, వైలట్ జాకెట్ వేసుకుని, మెడలో ముత్యాల హారం పెట్టుకుని, ముస్తాబయి అతని వెంట బయలుదేరింది.

క్లయింట్స్ ఎవరైనా వస్తే వాళ్లతో మాట్లాడి, ఏమైనా నోట్ చేసుకోవలసి వస్తే నోట్ చెయ్యమని, వాళ్ళని రేపు ఉదయం రమ్మని చెప్పమని సెక్రటరీకి చెప్పాడు.

అతను 'అలాగే' అన్నాడు.

హరిత, వాళ్ళిద్దరూ కలిసి వెళ్ళడంమూసి నిస్సహాయంగా, మౌనంగా ఊరుకుంది.

ఏం చేస్తుంది! ఎవరితో చెప్పుకుంటుంది! తనలో తాను కుమిలి కుమిలి ఏడ్వటం తప్పించి ఏం చెయ్యలేక పోతూంది. హరిత, మునుపటిలా ఇల్లు అంతా తిరగటం లేదు. గది వదలి బయటకు రావటం లేదు.

రోజాయే ఇప్పుడు ఇల్లు అంతా చక్కబెట్టుకుంటోంది. నౌకర్లకు ఏం కావలసినా ఆమే ఇస్తోంది. ఇంటికి ఎవరు వచ్చినా రోజాయే మాట్లాడుతూంది.

కృష్ణసుమంత్ హరితను మునుపటిలా ఇల్లు అంతా తిరిగేటట్టు చెయ్యాలని చాలా ప్రయత్నించాడు. ఆమె ససేమిరా అతనిమాట

# మువ్వల మురళి

వినలేదు. ఈ ఇల్లు తనది కానట్టు దూరంగా వుండిపోతూంది.

భార్య ప్రవర్తనకి రోజు రోజుకి విసుగేసింది. ఇప్పుడు ఏమైంది? ఆమెకేం తక్కువ చేశాడు తను!

రోజా ఈ ఇంట్లో వుంటోందనేగా ఆమెకు ఆ ఉక్రోషం అంతా! రోజా ఇక్కడ వుండక ఎక్కడకు పోతుంది?

తను తప్పిస్తే ఆమెకు ఎవరూ లేరే!

హరితకు అలా కాదు. అమ్మా,అన్నయ్యా, వదినా, బంధువులు అంతా వున్నారు.

ఆమెకు అన్యాయం చేసి, ఇంట్లోంచి బయటకు పంపేయడానికి తన మనసు ఒప్పుతుందా?

ఏమైతే అయింది అని ఇంటి బాధ్యతలు అన్నీ రోజాకే అప్పగించేశాడు.

డబ్బు హరితకు ఇవ్వబోతుంటే ఒక రోజు—

"నాకెందుకు ఇవ్వటం! మీ రోజా వుందిగా! ఆవిడకు ఇవ్వండి." అంటూ ఆమె భర్తమీద కంయ్ మంది.

అప్పటి నుండి అతను డబ్బు కూడా రోజాకే ఇవ్వసాగాడు. అతను ఇచ్చిన డబ్బు అంతా చాలా జాగ్రత్తగా బీరువాలో పెట్టి, తాళం వేసి, ఆ తాళాలు జాగ్రత్తగా దాచేది.

హరితకు ఇదంతా చూస్తుంటే ఒళ్ళు అంతా కారం రాసుకున్నట్టుగా అనిపించసాగింది. అన్నయ్యావాళ్ళూ రావడానికి ఇంకా పదిరోజులు పడుతుంది. అంతవరకూ ఓపిక పట్టుకుని, వాళ్ళరాక కోసం ఎదురుచూస్తూ కూర్చోవలసిందే! అంతే! గాఢమైన నిట్టూర్పు ఒకటి వదిలి అలాగే కూర్చుంది.

ఆమె నేత్రాలు మాత్రం సంతత ధారగా కన్నీటిని వర్షిస్తూనే వున్నాయి.

* * *

కారులో తిరిగి యింటికి వచ్చేస్తుంటే —

కృష్ణసుమంత్ కారుని మెల్లగా డ్రైవ్ చేస్తున్నాడు. కళ్ళు తిప్పి రోజా వైపు చూస్తూనే వున్నాడు. రోజా తల ఎత్తి అతనివైపు చూడలేక పోతూంది.

"రోజా!" మృదువుగా పిలుస్తూ ఆమె భుజంచుట్టూ చెయ్యి వేసాడు.

"ఊఁ!" అంటూ కనురెప్పలు పైకెత్తి అతని కళ్ళల్లోకి చూసింది

"ఇప్పుడు తెలిసిందా! నేను ఎక్కడికి తీసుకువెళ్ళానో" అంటూ నవ్వాడు.

రోజా ముఖం ఎర్రగా కందిపోయింది సిగ్గుతో. జవాబు ఇవ్వలేదు.

"ఏమిటి! మాట్లాడవు?" మళ్ళీ కవ్వించి అడిగాడు.

"ఈసారి నాకు చెప్పకుండా ఎక్కడికి అయినా తీసుకువెళ్తే వస్తానేమిటి!"

"ఎందుకురావు. చక్కగా వస్తావు. ఇప్పుడు వచ్చావుగా!" అంటూ గట్టిగా నవ్వేశాడు.

"తెలియక ఎక్కడికో అని వచ్చాను. ఇప్పుడు తెలిసిందిగా! ఇక ఛస్తే రాను!" అంటూ మూతి ముడుచుకుంది.

"రాకపోతే నేను వూరుకుంటానా! బల



# మువ్వల మురళి

ఎంతంగా లాక్కువెళ్లి ఆ హోటల్ రూమ్‌లో పడేస్తాను.'' అంటూ మళ్లీ నవ్వాడు.

రోజా సిగ్గుపడిపోయింది. తలఎత్తి అతని వైపు చూడలేదు. రెండు చేతులతో చెవులు మూసుకుంటూ—

''మీరు ఇంకేమి మాట్లాడొద్దు. నేను వినను'' అంది మొండిగా.

''సరే, ఇంటికి వెళ్లాక చెప్తాను.''

''అప్పుడూ నేను వినను'' నవ్వింది.

''హరిత పడుకున్నాక నీ గదిలోకి వస్తానుగా, అప్పుడు చెప్తాను.''

రోజా విననట్టు ముఖం పక్కకు తిప్పేసుకుని, కారులోంచి బయటకు చూస్తూ కూర్చుంది. కృష్ణసుమంత్ మరి మాటలు పెంచలేదు. తనలో తాను నవ్వుకుంటూ మౌనం వహించాడు.

అతని ఆంతర్యం అంతా ఆనందంతో చిందులు వేస్తోంది.

ఇంటికి వచ్చేసరికి సరిగ్గా తొమ్మిదిన్నర అయింది. హరిత భోజనం చెయ్యలేదు, పడుకుంది.

కృష్ణసుమంత్, రోజా ఇద్దరూ ఒక్కసారే భోజనం చేశారు. ఇద్దరూ సరదాగా కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ భోజనం ముగించి, ఇద్దరూ ఎవరి గదుల్లోకి వాళ్లు వెళ్లిపోయారు.

అతను ఆరోజు వచ్చిన పేపర్ చూస్తూ, సోఫాలో కూర్చున్నాడు. హరిత మెలకువగానే వున్నా, కళ్లు మూసుకుని మంచం మీద పడుకుంది.

పేపర్ చదువుతూ చాలాసేపు అక్కడే కూర్చున్నాడు. టైము చూసుకుని 'పదీ నలభై అయిదు అయింది' అని లేచి తలుపు మూసి, లైటు ఆర్పి మంచం మీద పడుకున్నాడు.

అతనికి అసలు నిద్రపట్టలేదు. పదకొండు గంటలు దాటింది. హరిత మెల్లగా నిద్రలోకి జారుకుంది. ఆమెను తట్టి పిలిచినా పలకలేదు.

కృష్ణసుమంత్ మెల్లగా మంచం దిగి, చప్పుడు కాకుండా తలుపులు తీసుకుని, రోజా గదిలోకి దారి తీశాడు !

(ఇంకావుంది)

## ఉత్తరాలు

[5 వ పేజీ తరువాయి]

### సీరియల్స్

మీరు ప్రచురిస్తున్న సీరియల్స్ 'జీవితగమ్యం' 'మువ్వల మురళి' చాలఇంటరెస్టింగుగా సాగుతున్నవి. మువ్వల మురళి సీరియల్ ఈ వారం కాస్త నిరుత్సాహం కలిగించినదనిచెప్పక తప్పదు. కృష్ణసుమంత్ ఇద్దరిని వివాహము చేసుకొనాలని అనుకోవటము నాకేమి నచ్చలేదు. కృష్ణసుమంత్ గొప్పవాడు గదా? గొప్పవాళ్లు ఏమి చేసినా బాగుగానే ఉంటుంది. అదే పేదవారుచేస్తే ప్రజలువిమర్శిస్తారు. ఈవారం చదువుతుంటే ఈ మధ్య చూసిన ఒక సినిమా గుర్తుకొస్తున్నది. టైటిల్‌కు న్యాయం చేగూరుస్తున్నారని తలుస్తాను. ఏది ఏమైనా రెండునవలల మాచేత ఆసక్తిగా చదివింప జేస్తున్న రచయిత్రులిద్దరికి నా అభినందనలు.

పి. బాబానందప్రసాదు (విజయవాడ)

*   *   *

"మువ్వల మురళి" సీరియల్‌లో కృష్ణసుమంత్ భోజనం చేశాక హరిత చీర చెరుగుతో చేయితుడుచుకోవడం నేటి నూతన పద్ధతులనుకోరే యువతీ యువకుల జీవితంలో అసాధ్యము.అయినా సీరియల్ చాలాఉత్సాహంగా సాగుతోంది.ఇకకధలలో "భయం" పత్రికకే ఆకర్షణ తెచ్చింది. ఇంత మంచి పత్రికను అందజేస్తున్న మీకు చాలా థ్యాంక్స్.

జి. వి. మల్లికార్జున, బాబు (ఆత్మకూరు)

### కథలు

29—8—80నాటి (మీ) మా ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వెలువడిన "ఇదేం బుద్ధి" "కమల విడాకులు"కధలు చదివించేయిగా ఉన్నాయి. "మువ్వల మురళి"సీరియల్ మాంచి రసవత్తరంగా సాగుతోంది. "లోకం పోకడ" వూమెన్ గారికార్టూన్‌లు హాస్యోక్తంగా ఉన్నాయి. ప్రచురించిన మీకు మా ధన్యవాదాలు.

రాయవరపు ఈశ్వరరావు (మింధి)

### శ్రీ కొడవటిగంటి

శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారి జీవిత చరిత్ర గురించి, క్లుప్తంగా వ్రాసిన రచయితకు, ప్రచురించిన మీకు నా అభివందనములు. సీరియల్ 'మువ్వల మురళి' చదువుతుంటే ఎంతో ఆసక్తిదాయకముగా చదవాలని అనిపిస్తుంది.

కె. వెంకటరమణరెడ్డి (అనంతపురం)

### కలర్ ఫొటో

5—9—80నాటి ఆంధ్రవారపత్రికముఖచిత్రం 'సింపుల్ కపాడియా' అసభ్యంగా ఉంది. ఇందులో ప్రచురించిన కథల్లో భయం, అక్కయ్య సలహా బాగున్నాయి. భయం కథలో చివర ప్రసాదరావ్ చనిపోవడం మాకు చాలాబాధఅనిపించింది.'అమ్మాయి మొగుడు— మామకు యముడు' కృష్ణ, రాజ్యలక్ష్మిల కలర్ ఫొటో అందించిన పత్రికకు థ్యాంక్స్.

కె. జి. హేమలత (కుప్పం)

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## రచయితలకు గమనికలు

★ ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కధలూ యితర రచనలు పంపదలచుకున్నవారు సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీ నగరం,విజయవాడ—520 003 అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరుమీద శీర్షిక పేరు పేర్కొనడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ,చిరునామా రచన చివరకూడా స్పష్టంగావ్రాయాలి— హామీపత్రం జత చెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని త్రిప్పి పంపబడాలని కోరుకునేవారు— వారి స్వంత చిరునామా గల తగినన్ని తపాలాబిళ్ల లంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనే గాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయం కోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తరప్రత్యుత్తరాలకి తావులేదు కాని—తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు— రచన పేరు— అది పంపిన తేదీ, వివరంగా వ్రాయండే, వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామా గల తగినన్ని తపాలాబిళ్ల లంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్లు పంపేవారు కూడా 8 వారాలలోగా మా మీద ఉత్తరాల దాడి చెయ్యకూడదు... ప్రతీ కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి.

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ రచనల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలు వెంబడి జరుగుతుంది.

★ రచయితలకు కార్టూనిస్టులకు [ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పడ్డ' వారికి తప్ప తతిమ్మా అందరికి] అవి పడ్డ "ప్రతు"లను— కాలక్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము.కాపీలు టపాలోపోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు.

సం ॥

## పోతుకూచి ఆత్మకథ ఆవిష్కరణ

పోతుకూచి సాంబశివరావు రచించిన తన ఆత్మకథలో సత్యాన్ని సరిశీలనతో హృదయస్పందనతో చెప్పే గుణం కనిపిస్తోందని శ్రీ త్రిపురాన రాఘవదాసు నా జీవితంలో ప్రయాణాలు, ప్రయోగాలు, అన్న గ్రంథం ఆవిష్కరిస్తూ అన్నారు. శ్రీకృష్ణ

## అప్పుడప్పుడు అక్కడక్కడ

దేవరాయ భాషా నిలయం వారు ఏర్పాటు చేసిన యీ సభకు డా. దాశరథి అధ్యక్షత వహించారు.

ముఖ్య అతిథి విధాన పరిషత్ చీఫ్ విప్ శ్రీ ఎ. చక్రపాణి మాట్లాడుతూ పోతుకూచి నిర్వహణ శక్తి అద్వితీయమని, బెంగుళూరులోని అఖిల భారత తెలుగు రచయితల మహాసభలే దానికి తార్కాణమని పోతుకూచి గుణగణాల్ని శ్లాఘించారు. బాల శివయోగి శ్రీ పోతుకూచి ని ఆశీర్వదిస్తూ వ్యక్తిగా సమర్థుడనీ, శక్తివంతుడనీ, బాల్యం దాకా రచించిన ఆత్మకథ దృష్ట్యా శ్రీ పోతుకూచికి బాలకృష్ణ విగ్రహం, విభూది, సుగంధం సృష్టించి ప్రసాదించారు. శ్రీ పోతుకూచి సాంబశివరావు మాట్లాడుతూ ఈ ఆత్మకథను వాస్తవిక గాథల రూపంలో వ్రాస్తున్నానని, ప్రతిసంఘటన సాంఘిక ప్రయోజనకారిగా వుండేలా చిత్రిస్తున్నానని అన్నారు. శ్రీ అక్కిరాజు జనార్దనరావు వందనసమర్పణ చేశారు.





### డా|| వి. లక్ష్మణరెడ్డి

స్వాతంత్ర్యానికి ముందు తెనుగు పత్రికల రూపు రేఖల మీద మొట్టమొదటి సారి డాక్టరేట్ కోసం, పరిశోధన చేసిన శ్రీ. వి. లక్ష్మణరెడ్డికి నాగార్జున విశ్వవిద్యాలయం వారు 'డాక్టరేటు' ప్రదానం చేశారు. శ్రీ రెడ్డి గన్నవరం కళాశాలలో తెనుగు శాఖాధిపతిగా పని చేస్తున్నారు. వీరికి కన్నడం, తమిళం, హిందీ, లింగ్విస్టిక్స్, జర్నలిజంలలో డిప్లొమాలున్నాయి. హర్యానాలో వీరి తెనుగు గ్రంథాన్ని ఒక పాఠ్యగ్రంథంగా వుంచారు.



### యోగాశ్రమ లేఖలు

మాస్టర్ సి. వి. వి. అడుగు జాడలలో యోగాశ్రమ లేఖలుఅనే పుస్తకం మా కార్యాలయం చేరింది. 95 పుటల గ్రంథం వెల 5 రూపాయిలు. ప్రతులకు మారుతీ పబ్లికేషన్సు, గాంధినగరం, హైదరాబాద్—500380కి వ్రాయవచ్చును.

### ఆ త్మ హ త్య

నవల. రచన : పి. నరసింహారావు. పేజీలు 156. వెల రు. 7—50. బాలి ముఖచిత్ర రచన. ప్రతులకు వాహిని పబ్లిషింగ్ హవుస్, విజయవాడ—2కు వ్రాయవచ్చును.

### వేదనా సౌరభము

కవితా సంపుటి. రచన : శ్రీ మహమ్మద్ అలీ, 56 పేజీలు, వెల : 5రూపాయలు, ప్రతులకు : భారతీ సాహిత్య సమితి, కోరుట్ల, కరీంనగర్ జిల్లా.

### ఎదలోయలో నిదురించే ....

ఎదలోయలో నిదురించే అన్న నవల జి. సత్యమూర్తి రచన. 208పేజీలు, వెల 10 రూ. మా కార్యాలయం చేరింది. 'చంద్ర' ముఖచిత్ర రచన గలయీ నవల ప్రతులకి మాధురి పబ్లికేషన్సు, గాంధీనగర్, హైదరాబాద్ కి వ్రాయాలి.




Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S Radhakrishna.




# ప్రవేశపెడుతోంది
# కొత్త
# బోనస్ బనియన్

**సుఖ అనుభూతి**
**ఎక్కువ మన్నిక**
**తక్కువ ధర**

వి ఐ పి బోనస్ ఎక్స్ట్రా-ఫైన్ బనియన్. 'వైటెక్స్', 'సాఫ్టెక్స్' పద్ధతుల తాలూకు ప్రయోజనాలన్నీ ఇప్పుడు అనువైన ధరల్లో. సుఖానుభూతి కోసం తొడుక్కోండి వి ఐ పి బోనస్ బనియన్— భుజాలూ, చేతులూ సాగిపోవు. అందం కోసం, మన్నిక కోసం ఇది మెర్సెరైజ్డ్ దారంతో కుట్టబడింది.

**హెచ్చు ధర**
**లేకుండానే**
**హెచ్చు మృదుత్వం**




శ్రేష్ఠమైన లోతొడుగుల కల్పనలో
అందెవేసినవారు

CASHH-3 234 TEL

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA








నలుగురూ కలిసి
ఆనందించే
సమయము ఇదే !








థమ్స అప్

కోలాయొక్క ఉల్లాసము
తాజాదనమునకు